# సత్యసామ్రాజ్యం.

( కథ )



తల్లాప్రగడ ప్రకాశరాయుడు.

వెల :

మూడు అణాలు.

ఈ పుస్తకం కూడా

నా మిత్రులు శ్రీ చక్కా సత్యనారాయణగారు (నిడదవోలు)

ధనవ్యయముచేసి ముద్రింపించినారు.

త. ప్ర.

1942.

నిడదవోలు

శాంతి ప్రెస్‌లో ముద్రితము.

# పీఠిక.

సత్యమొక్కటే ఈ యనంతవిశ్వానికి మూలాధారం. సత్యమే పరమేశ్వరుని ప్రత్యక్షస్వరూపం. సత్యమునందు అనుభవపూర్వక దృఢవిశ్వాసమే ఉత్తమ మతధర్మా లన్నిటి సారం. ఈవిశ్వాసములేక ప్రపంచంలో ఎప్పుడూ, ఎక్కడా నిజమైన సుఖమూ, శాంతి నెలకొల్పబడి యుండలేవు. "మనిషినై పుట్టి నే నీలోకంలో నెరవేర్చవలసిన పనియేమి?" అనే ప్రశ్న వేసుకొని దానికి సరియైన సమాధానం తెలుసుకొని నిర్భీతితో నిత్యమూ దాని ననుసరించి బ్రతికే సాధన కెవరు పూనుకుంటారో వారే మానవకోటికి మార్గదర్శకులు. నూటికో, కోటికో ఒకడు చొప్పున అటువంటి సార్థక జన్ము లింకను ఉండబట్టే మానవజాతి యింకా ఈమాత్రంగా నైనా నిలిచివుంది.

టాల్‌స్టాయి మహాశయుని ఒక కథ ననుసరించి ఇది వ్రాయబడ్డది. ఆమహాత్ముని జీవితానుభవమంతా, అతను వ్రాసిన గ్రంథాల సారాంశమంతా ఈకథలో ఇముడ్చబడ్డదని చెప్పవచ్చును. పశుబలమే ప్రధానంగా చేసికొని వ్యక్తులు జాతులూ ఒకరి నొకరు హతమొనర్చుకొనడమే గొప్పతనంగా ఎంచబడుతూన్న కాలమిది. అధికారవాంఛలోను ధనమదాంధతలోను మునిగి తేలుతూన్న నిరంకుశప్రభుత్వా న్నొకవంకను ధైర్యస్థైర్యాలు కోల్పోయి బానిసలై బ్రతుకు ప్రజాకోటి నొకవంకను తనదేశంలో చూచాడు టాల్‌స్టాయి. చెడుగును చెడుగుతోను, హింసను ప్రతిహింసతోను సాధింపబూనటం అమానుష మని చెప్పి, మనలో ప్రేమబలముంటే ప్రతికక్షిలోని చెడుగంతా అవశ్యంగా నిర్మూలమవుతుందని తన దేశానికీ,

ప్రపంచానికీ ఉపదేశించిన ధర్మవిదుడు టాల్‌స్టాయి. దైవ భక్తితో కూడిన జాలిగుండె ఒకటి, తల పడిపోయినా తాను చెట్టి అన్యాయానికీ పాల్పడననే దృఢనిశ్చయ మొకటి-- ఈ రెండూ కలిసి ప్రపంచంలోని నిరంకుశత్వాన్నంతనూ నిర్మూలింపగల వని టాల్‌స్టాయి విశ్వాసం. ఈ ధర్మాన్ని వ్యాపింపజేయు డానికే జీవిత మర్పించాడతడు.

ఇన్ని యుత్తమ గుణాల మూర్తిభావమే ఈకథలోని ధర్మన్న. లోకంలో నిజమైన సుఖం, ఆనందం వినమ్రులైన ప్రజాసామాన్యానివేకాని, సైతానుకు దాసులైన నిరంకుశ ప్రభువులదీ, ధనగర్వాంధులదీ కాదని ధర్మన్న జీవితం స్పష్ట పరుస్తోంది. సామాన్యులలో సామాన్యుడై, భోగభాగ్యాలను విసర్జించి, పరుల కష్టసుఖాలను తనవిగా జేసుకోగల ప్రాజ్ఞుడే సామ్రాజ్యాధిపత్యం కూడా వహించడానికి అర్హుడని తేటతెల్ల మౌతున్నది.

టాల్‌స్టాయి యొక్క హృదయావేదననుండి ఉద్భవించిన కథానాయకుడు ధర్మన్న. నాడు టాల్‌స్టాయి చిత్రించినపాత్ర నేడు సజీవుడైన ప్రజానాయకుడై గాంధి రూపమున ప్రపంచానికదే సందేశాన్ని వినిపిస్తున్నాడు. ఈరోజున దారుణ కష్టాలలో పడి నమసి పోతున్న ప్రపంచజాతుల దుస్థితిని తొల గించగల దివ్యసాధనం గాంధిప్రణాళిక యొక్కటే. ఈదృష్టి తోనే పామరులేమి పండితులేమి ఈకథయొక్క అంతరార్థాన్ని గ్రహింపవలసి యున్నారు.

త. ప్ర.

# సత్యసామ్రాజ్యం.

ఒక గ్రామంలో భాగ్యవంతుడైన గృహస్థు డొకడుండే వాడు. అతనికి ముగ్గురు కొడుకులు, ఒకకుమార్తె. పెద్దవాడు యుద్ధభటుడు; పేరువీరదాసు. రెండవవానిపేరు మాణిక్యం. మూడవవాడు ధర్మన్న. కుమార్తెకు పెండ్లికాలేదు. ఆమె చెవిటిది, మూగది. పేరు పున్నమ్మ. రాజు సైన్యంలో సిపాయిగా చేరి వీరదాసు పరదేశాలమీదికి యుద్ధానికి పోయినాడు. మాణిక్యం ఒక పట్టణానికి చేరి వర్తకం ప్రారంభించాడు. ధర్మన్న తల్లిదండ్రులతోను చెల్లెలితోను ఇంటివద్దనే వుండి పోయినాడు. వ్యవసాయ వృత్తిలో నడుము వంగేటట్లు కష్టించి పనిచేస్తున్నాడు.

వీరదాసు క్రమంగా సైన్యంలో పెద్ద ఉద్యోగం సంపాదించాడు. చాలా భూవసతికూడా సంపాదించి, గొప్ప కుటుంబంలో పిల్లను పెండ్లాడి, సుఖంగా కాలం గడుపుతున్నాడు. తనకు వచ్చే నెలజీతమూ ఎస్టేటుమీద వచ్చే ఆదాయమూ రెండూ కలిపినా వీరదాసు ఇంటి ఖర్చుకే సరిపోయేదికాదు. భర్త తెచ్చిన డబ్బంతా భార్య కళ్లుమూసుకొని ఖర్చు పెట్టేస్తూవుండేది. ఏనాటికానాడు ఇంట్లో లేమే కనుపించేది కాని చాలునన్న తృప్తి లేదు. ఖర్చుకుపైగా మిగలడం అసలెప్పుడూ లేదు. ఇంట్లో జరుగుబాటులేని ఒకసమయంలో శిస్తులురాబట్ట డానికి వీరదాసు తన జమీా మీాదికి స్వయంగా బయలుదేరి

పోయినాడు. కానీ అక్కడ పనిచేసే గుమస్తా వీరదాసుతో "అయ్యా, ఇంత నిస్సారపు భూములమీద ఇంకా ఆదాయ మెక్కడనుండి వస్తుంది? భూమిని బలపరచి ఇంకా పెట్టుబడి పెడితే కొంత అధికంగా ఫలించవచ్చు" నని స్పష్టంగా చెప్పి వేశాడు.

ఈమాటతో నిస్పృహాజెంది వీరదాసు తన తండ్రిఇంటికి ప్రయాణమై పోయినాడు. "ఏమి నాయనా, నీకింత భాగ్యము న్నది కదా! ఈకుటుంబ ఆస్తినుండి నేనింతవర కొక్క దమ్మిడీ నైన అనుభవించలేను. ఉన్నమట్టుకు పంచి నామూడోవంతు వాకిస్తే పట్టుకొని వెళ్లుదామని వచ్చాను. ఏమంటావు?" అన్నాడు తండ్రితో.

తండ్రి వృద్ధుడైనాడు. కుమారుని కిట్లా జవాబిచ్చాడు "నీప్రజ్ఞవల్ల నీవొక్క గవ్వాయినా ఇంట్లో కెన్నడూ తెచ్చివుండ లేదు, పైగా మూడవభాగం నీకెట్లా వస్తుంది? మొదటినుంచీ యిల్లుకనిపెట్టుకొనివున్న ధర్మడికీ పిల్లదానికీ అన్యాయం చేయ టంకాదాయిది?" దానిమీద వీరదాసన్నాడు "వాడొక వెర్రి వాడు, అది వయసుమీరిన పిల్ల; పైగా చెవిటిది, మూగది. వాళ్ళబ్రతుకు లెట్లాగైనా కడతేరిపోతాయి. అసలీ యాస్తితో వాళ్ళకేమిపని?" ధర్మన్నను దగ్గరకు పిలిచి ఈవిషయం చెప్పి నాడు తండ్రి. "నాఅభ్యంతర మేమీలేదు, నాయనా. అన్న కెంత కావలస్తే అంతా తీసుకోమనవచ్చు"నని ధర్మన్న వెంటనే జవాబిచ్చాడు, వీరదాసు తనవంతు ఆస్తి పంచుకొని పోయి

తిరిగి రాజుకొలువులో ప్రవేశించాడు.

మాణిక్యం వర్తకంలో చాలాడబ్బు గడించాడు. ఒక పెద్దవర్తకుని కుమార్తెను పెండ్లిచేసుకొన్నాడు. మాణిక్యానికి కూడ ఎంతడబ్బైనా చాలేదికాదు. ఎప్పటికప్పుడు ఇంట్లో దరిద్రమే. అన్నవలెనే తనకూ సంసారం గడవక ఒకనాడు తండ్రియింటికి వచ్చి తనభాగం తనకు పంచిపెట్టమన్నాడు. ధర్మన్న చెమటూడ్చి కూడబెట్టిన ఆస్తిని ఇతరులకు కట్టబెట్టడం తనకేమాత్రమూ యిష్టంలేదని తండ్రి రెండవ కొడుకుతో చెప్పివేశాడు. అప్పుడు మాణిక్యం తండ్రితో యిట్లన్నాడు "వాడికేమాత్రం కావాలట్యా? అమాయకుడికి ఆస్తెందుకు? వాడికిక పెండ్లిఅయే యోగ్యత కూడా లేదుకదా! అది సరే ముదిపిల్ల, ఆస్తితో దానికి పనేముంది?" ఇట్లంటూనే తానే తమ్ముని పలకరించి "ఒరే, ధర్మన్నా ఇటుచూడు! వచ్చే ధాన్యంలో సగం నాకియ్యి. వ్యవసాయపు పనిముట్లు, పశువులు అన్నీ నీవే వుంచుకోవచ్చు. మన తెల్లగుర్రాన్ని మాత్రం నేను తీసుకొని వెడతాను. నీ నాగలికి పనికి వచ్చే ఎద్దులు రెండున్నాయిగా!" అన్నాడు. ధర్మన్న నవ్వుతూ యిట్లన్నాడు "అట్లాగే పుచ్చుకుందూ! నీకేది కావలిస్తే అదల్లా తీసుకో— నన్నడగనక్కరలేదే! కష్టపడి పనిచేసుకుంటే నాకెప్పుడూ యేలోటూలేదు. తీసుకో— నీయిష్టం!" కనుక మాణిక్యం కూడ తన భాగం పంచుకున్నాడు. తనవంతు ధాన్యం బండ్లమీద పట్టణానికి తోలించుకొని పోతూ తెల్ల గుర్రాన్నికూడ

తీసుకు వెళ్లినాను. ధర్మన్నవద్ద నుక్కకి ముసలియెద్దులు రెండు మాత్రం మిగిలినాయి. అతను చెప్పటివలెనే విరామం లేకుండ పొలం పని చేసుకుంటూ, తనకు మిగిలిన కొద్దిపాటి వసతితోనే తల్లిదండ్రులను, చెల్లెలిని పోషిస్తూ కాలంగడుపుతున్నాడు.

## 2.

అన్నదమ్ములు ముగ్గురూ ఇంత సఖ్యతతో ఆస్తి పంచుకొనడం చూచి శని (సైతాను) తనలో తాను కొరకొరలాడుతున్నాడు. ప్రపంచంలో దుష్టత్వం, పరస్పరస్పర్ధలు ఎంతగా పెరిగితే అంత సంతోషించేవాడు కనుక ఈ యన్నదమ్ములింత మైత్రితో పనులు చక్కబెట్టుకొనడం తనకొక అవమానంగా యెంచుకున్నాడు. వెంటనే తన బాట్లలో ముగ్గుర్ని చేరబిలిచాడు.

“ఒరే, వాళ్లు ముగ్గురన్నదమ్ములు— తెలిసిందా? సిపాయి వీరదాసు, వర్తకుడు మాణిక్యం, మరొకడు అమాయకుడు ధర్మన్న. మొన్న వాళ్లు ఆస్తి పంచుకొనడంలో ఎంతైనా కలహం పెట్టుకొనివుండవలసింది. కాని అనుకున్నట్లే మాత్రం జరుగలేదు. బహుశాంతింతో ఆస్తులు పంచుకొని యెవరిదారిని వారు పోయినారు. ఆపైగ్రి ధర్మన్నను బట్టే పనులింత సవ్యంగా నడచి పోతున్నాయి. నేను భయపడ్డట్టు గానే వ్యవహారమంతా చెడింది. నాకేమాత్రం పాలుపోవడంలేదు. తక్షణం మీరు ముగ్గురూ పోవాలి. ఒకొక్కడు ఒకొక్కన్ని

పట్టుకోండి. వాళ్ళలో బద్ధవైరాలు కల్పించి, ఒకణ్ణొకడు చెండాడుకునేటట్లు చేసి ముగ్గుర్నీ నాశనం చేసిరావలె! ఇదే నాఆజ్ఞ, పొండి! మరిక్కడ నిలవకండి! — ఈకార్యం తప్పక నెరవేర్చగలమనే ధైర్యమున్నదా మీకు?" అని శనిప్రశ్నించగానే "చిత్తం, తప్పక నెరవేర్చగలం" అని సేవకులు జవాబిచ్చారు. "అయితే మీరు పన్నే ఉపాయ మేమో, మీపని యెట్లా ప్రారంభిస్తారో చెప్పండి" అన్నాడుశని. "ఉపాయానికేమున్నది, ఇప్పుడే పోయి ముగ్గురి ఐశ్వర్యం దుంపనాశనం చేసి వేస్తాం. తినడానికి తిండిలేకుండా చేసి ముగ్గుర్నీ ఒకచోటికి చేరుస్తాం. అప్పుడొకణ్ణొకడు నిందించుకుంటూ ముగ్గురూ కొట్టుకొని చస్తారు. ఇట్లా మనకార్యం నిస్సందేహంగా నెరవేరుతుంది" అని పిశాచాలన్నారు. "సెబాస్, బలే బాగుందిరా! అయితే నిద్రాహారాలుమాని మీరు పనిచేయవలెసుమా! ఇకపొండి, పనిపూర్తి అయేవరకూ మీరు తిరిగి నావద్దకు రావద్దు. పని పాడుచేసుకొని వచ్చారంటే, మిమ్మల్ని ప్రాణాలతో వదలి పెట్టను. ఒళ్ళుచీరించేస్తాను" అన్నాడుశని.

పిశాచాలు ముగ్గురూ యజమానివద్ద సెలవు పుచ్చుకొని ఒక నిర్జన స్థలానికిపోయి కూర్చుని పనిలో సాధక బాధకాలను యోచించుకున్నారు. పనులు పంచుకొనడంలో భిన్నాభిప్రాయాలు బయలు దేరినాయి. ఎవడికివాడే తేలిక పని1పుచ్చుకొని త్వరలో చేసుకొని పోదామని చూచాడు. పోటాలు కుదరక, చీట్లువేసి వాటి ప్రకారం ఎవరికేపనివస్తే

తెవని పుచ్చుకోవాలని నిశ్చయించారు. ఏ వొకడిపని ముందుగా ముగిసినా, వాడు వచ్చి మిగత యిద్దరికీ సాయపడ వలెననే షరతుపెట్టుకున్నారు. తిరిగి మంచిచెడ్డలు విచారించు కునేటందుకు ఫలానారోజున మళ్లీ ఆచోటనే ముగ్గురూ కలి యాలనుకొని ఎవరి పనిమీద వారుపోయినారు.

అనుకున్న దినానికి తిరిగి ముగ్గురూ అక్కడనే సమా వేశమైనారు. ఎవడి యనుభవాలువాడు చెప్పడం ప్రారంభిం చారు. వీరదాసు వద్దకు పోయివచ్చిన పిశాచం తనకథ యిట్లా చెప్పినాడు "నాపని నిర్విఘ్నంగా సాగుతూనే వున్నది. వీర దాసు తిండికోసం వెతుక్కుంటూ రేపే తండ్రియింటికి దారి బట్టేటట్లు చేసివచ్చాను". "అయితే ఏ యుక్తి చేత వాణ్ణి ఈ స్థితికి తేగలిగినావ" ని మిగత యిద్దరూ ప్రశ్నించారు. "నేను పోయి చేసిన మొదటి పనియిది — వినండి: వీరదాసును మొదట రాజువద్దకు పరిచయించాను. ప్రపంచాన్నంతనూ జయించి రాజాజ్ఞల వద్దకు తెస్తాననీ, తనకొక సేన వప్పగించి యుద్ధానికి పంపవలసిందనీ తనరాజుతో చెప్పగలిగే మొండిసాహసం వాడిలో కలిగించాను. వీరదాసు మాటలు విని రాజు ఉప్పొంగిపోయినాడు. మేరలేని మురాశ కలిగింది. రాజు వెంటనే వీరదాసును సేనాధిపతిగా చేసి సరిహద్దురాష్ట్రం మీద దండెత్తమన్నాడు. రెండుసేనలూ యుద్ధభూమిలో ఎదురొడ్డి నిలిచాయి. కాని అకడచిన రాత్రి వీరదాసు శిబి రంలో వున్న తుపాకి మందంతా పనికిరాకుండా తడిపి పాడ

చేశాను. శత్రురాజుయొక్క శిబిరంలో లెక్కలేనన్నిగడ్డిబొమ్మ లను చేయించి వాటికి సిపాయి వేషాలు వేయించి సైన్యం వెనుక నిలబెట్టించాను. ఇంత బ్రహ్మాండమైన శత్రుసేనను చూచి వీరదాసుకు భయంపుట్టింది. అయినా కొంత ధైర్యం తెచ్చుకొని ఒక్కసారిగా శత్రువులమీద తుపాకులు పేల్చ మని వీరదాసు తన సైన్యాని కాజ్ఞయిచ్చాడు. కాని ఒక్క తుపాకిలోకూడా మందంటుకోలేదు. ఈ దుశ్శకునం చూచి వీరదాసు సేనంతా నలుదిక్కులా పారిపోయారు. పారిపోయే వాళ్ళను శత్రువులు వెంబడించి అందరినీ హతంజేశారు. వీర దాసు పూర్తిగా ఓడిపోయి శత్రురాజుకు లోబడ్డాడు. తన జమీఅంతా శత్రువుల పరమయింది. రేపే వాణ్ణిఉరితీయ బోతున్నారు. నాకింకొక్క పూట పనిమాత్రం మిగిలివుంది. ఏదో యుక్తిచేత వాడికి ఉరి చావు తప్పించి చెరసాలనుండి తండ్రియింటికి పారిపోయేటట్లు చేయాలి. దానితో నాపని పూర్తి అవుతుంది. తరువాత వచ్చి మీలో యెవరికైనా సాయ పడగలను" అన్నాడు పిశాచం.

మాణిక్యాన్ని నాశనం చేయబోయిన వాడు తరువాత తనకథ నిట్లాప్రారంభించాడు: "నాకెవ్వరి సహాయం అక్కర లేదు. నాపని కూడా బహుసులభముగా జరిగి పోతున్నది. ఒక్క వారం దినాలలో మావాణ్ణి గగ్గోలెత్తించనూ! ఆపైన ఇంక నిలవలేడు. నాకాధైర్యం పూర్తిగావుంది. నేనువెళ్ళగానే చేసినపని యేమంటారా, మాణిక్యం మనసులో అంతులేని

దురాశ కల్పించాను. కళ్ళతో చూచిన వస్తువల్లా యెంత డబ్బైనా సరే కొనితీరాలన్నంత వరకు పోయింది వాడి పేరాస. ఉన్నంతవరకు ప్రతి పైసా ఖర్చుపెట్టి, కావలసినవీ అక్కరలేనివీ లెక్కలేని వస్తువులు కొని ఇల్లంతా నింపివేశాడు ఇంకా కొంటూనే వున్నాడు. ఇప్పటికే అప్పులలో మునిగి పోయినాడు. అవితీరి గట్టున పడటం అసంభవం. మరొక వారంలో అప్పులవాళ్ళందరూ వచ్చి ఒక్కసారిగా మెడకు వురి పెడతారు. మురిసిపోతుంటూ వాడు రేపు తండ్రి యింటికి దారి బట్టవలసిందే!"

"ఇక నీపనెట్లావుందిరా?" అని ధర్మన్నవద్దకు పోయి వచ్చిన పిశాచాన్ని అడిగారు, "ఏమోనయ్యా, బాబూ నా పనేమీ బాగులేదు నేననుకున్నట్లొక్కటీ జరగడం లేదు. నేను మొదట పోగానే వాడు తాగే నీళ్ళచెంబులో ఉమ్మి వేసి కడుపులో నొప్పి పుట్టిద్దామని ప్రయత్నించాను! తర్వాత వాడు దున్నబోయే పొలంలో నాగలి నడవకుండా భూమిని రాయిలాగు గట్టిపరచాను. కాని నా ఆశంతా నిరాశయింది. వాడి పిచ్చితనానికి తగినట్లే ముందు వెనుకలు చూడకుండా పొలం దున్నడం ప్రారంభించాడు. నే నుమ్మివేసిన నీళ్లు వాడు తాగటంతోనే కడుపులో అమితంగా పోట్లుమాత్రం పుట్టినాయి. ఆ బాధతో గొడ్డుమూల్గినట్లు మూలగడం ప్రారంభించాడు. కాని దుక్కిమాత్రం మానలేదు. అదెక్కడి పట్టుదలో కాని నాగలి దాన్ని నాగలి పోతూనే వుంది. ఇది పనికాదని

చెప్పి నాగలి మధ్యకు విరిగేటట్లు చేశాను. "ఛీ, ఛీ ఇదేమి కొయ్య!" అని విసుక్కుంటూ వెంటనే ఇంటికిపోయి, అప్పటి కప్పుడు మరొక నాగలి తెచ్చి క్షణమైనా వృథాపుచ్చకుండా తిరిగి దుక్కి ప్రారంభించాడు. ఏమిటి వీడి మొండితనమని చెప్పి భూమిలోదూరి నాగలికర్ఱు గట్టిగా పట్టుకున్నాను. ఈఅడ్డు తగలగానే ఛాతితో నాగలి నొక్కి పెట్టి శక్తికొద్దీ పోనిచ్చాడు. కర్ఱు అతి వాడిగా వుండటంచేత నాచేతులు రెండూ చీలి బద్దలైనాయి. ఇప్పటికి నా పనింతమట్టుకు ఫలించింది. వాడి దుక్కి చాలభాగం పూర్తి అయింది. రండి, బాబూ! మీలో ఒకడైనావచ్చి నాకు సాయపడితే నేగాని మాటదక్కే ఆశలేదు. మనముగ్గురిలో ఒక్కడోడిపోయినా, మొత్తానికి పనంతా పాడైనట్లే. ఈవెర్రివాడింకా ఇట్లాగే మొండితనం చూపుతూ, భూమినుండి పంటపండించి కుటుంబాని కేలోటూ లేకుండా చేస్తాడు. అన్నలు దివాలాతీసినా వాళ్లను వీడేపోషించి సుఖపెట్టగలడు" అని మూడవపిశాచమన్నాడు. ఈకథ విని వీరదాసును పట్టిన పిశాచం మర్నాడేవచ్చి మూడవవానికి సహాయం చేస్తానని వాగ్దానమిచ్చాడు. తిరిగి మొదటిపనిమీదవాడు వెళ్లిపోయాడు.

## 3.

ధర్మన్న కష్టపడి పొలందున్నేశాడు. ఒకచిన్న మడిమాత్రం ఒకమూల మిగిలిపోయింది. అదికూడ పూర్తిచేయాలని తిరిగి పొలానికి బయలుదేరినాడు. కడుపునొప్పిఇంకా బాధిస్తూ

నేర్పుంది. సుఖమైనా, కష్టమైనా, పనిమాత్రం ఆగిపోకూడదని వెంటనే నాగలిపట్టి దున్నడం ప్రారంభించాడు. కొంతవరకు సాగి నాగలి కదలకుండా ఆగిపోయింది. ధర్మన్న కంటె ముందుగానే పిశాచం పొలానికివచ్చి భూమిలోదూరి చేతులూకాళ్లూ నాగలి నుంపకు చుట్టబెట్టి శక్తికొద్దీ వెనక్కులాగిపట్టుకున్నాడు

"ఏమిటీ తమాషా! చాల గట్టి పట్టు పట్టిందేదో!" అని విసుగుకుంటూ ధర్మన్న నాగటిచాలులో చేయిపెట్టినాడు. ఏదో పాములాగున మెత్తగా వేళ్లకు తగిలింది. రెండు చేతులతోనూ పట్టుబట్టి దాన్నట్లాగే ఊడబెరికి బయటపారవేశాడు. తల తోక లేని నల్లనిపాములాగె కదలుతూ అసహ్యంగా కనబడ్డది. "ఛీ ఛీ ఇదెక్కడనుంచి వచ్చింది!" అంటూ దాన్ని పైకెత్తి నాగలి కొయ్యకుబెట్టి నాలుగుబాదుదామని ధర్మన్న చెయ్యెత్తబోయినాడు. పిశాచం గొల్లున యేడుస్తూ, "అయ్యా నీకు దణ్ణం; నన్ను కొట్టకు. నీదాసుణ్ణయి ఏపని చేయమంటే ఆపని చేస్తాను" అన్నాడు. "సరే, ఇప్పుడు నాకడుపులో నొప్పిపోగొట్టగలవా అన్నాడు ధర్మన్న. "ఆహా, ఒక్కనిమిషంలో!" అనిఅంటూ పిశాచం తిరిగి నాగటిచాలులోదూరి గోళ్లతోమన్ను పెల్లగించి మూడువేళ్లు పైకిలాగి, వాటిని కట్టగట్టి ధర్మన్నచేతికిచ్చాడు. "అయ్యా, చూడు! ఏరోగానికైనా సరే ఇదిపెట్టిందిపేరు. ఇందులో ఒకముక్కనమలిమింగు. నీకడుపునొప్పి ఇప్పుడే పోతుంది" అన్నాడు. పిశాచం చెప్పినట్లు చేశాడు ధర్మన్న. కడుపునొప్పి అప్పటికప్పుడు అద్భుతంగా మాయమైంది. ఇక తన్ను [illegible]

పెట్టి పోసియ్యమని ధర్మన్నను వేడుకున్నాడు పిశాచం. "సరే పో! నీజోలినాకెందుకు? భగవంతుని తలుచుకుంటూపో- ముక్తి దొరుకుతుంది" అన్నాడు ధర్మన్న. భగవంతునిపేరు చెవిని పడగానే పిశాచం సంకటపడుతూ నీటిలోరాయి మునిగినట్లు భూమిలోదూరిపోయినాడు. దూరిన సొరంగంమాత్రం పూడకుండా అట్లాగేవుండిపోయింది.

తనవద్దమిగిలివున్న రెండువేళ్లూ టోపీలో దాచిపెట్టి ధర్మన్న మళ్లీ పొలం దున్నడం మొదలుపెట్టినాడు. చుక్కకాగానే నాగలివిప్పి యింటికిపోయినాడు. ఎడ్లనుదొడ్లో కట్టివేసి తానింట్లోకి పోయినాడు. వెళ్లిచూచేసరికి వీరదాసు, అతనిభార్య అప్పుడే కూర్చుని భోజనంచేయబోతున్నారు. వీరదాసు జమీ పూర్తిగా శత్రువశమయింది. ఎట్లాగో చావుతప్పించుకొని ఖైదు నుండి పారిపోయివచ్చి తండ్రియింటికి చేరుకున్నాడు.

వీరదాసు ధర్మన్నను చూచి "కొన్నాళ్లపాటు నీవద్ద వుండిపోదామని వచ్చానురా, తిరిగి నాకేదైనా వుద్యోగం దొరికేవరకూ నన్నూ నాభార్యను నీవేభరించవలె" నన్నాడు. "అలాగేన్నా తప్పకుండా అట్లాగే వుండవచ్చు. నాకేమిటి అభ్యంతరం? నీకిష్టమున్నన్నాళ్లుండ వచ్చు" నని చెపుతూ, ధర్మన్న వచ్చి వాళ్లుకూర్చున్న బల్లపక్కనే కూర్చోబోయినాడు. అది చూచి వీరదాసుభార్య "అబ్బా! ఏదో చెడువాసన! ఎప్పుడూ మట్టిలో పొలం పనిచేసుకొనే వాళ్లతో కూర్చుని భోజనం చేయటమెట్లా?" అంటూ సణగటం మొదలు పెట్టింది. అప్పుడు

వీరదా సన్నాడు ధర్మన్నతో "వింటున్నావు కదా! నీపక్కను కూర్చునిభోజనం చేయలేనంటున్నదీమె. నీభోజనం మరొకచోట కానిచ్చివస్తే బాగుంటుంది కాదూ?" "దానికేమిలే! నాతిండి బయటికేవెళ్లి తింటాను. నా మూలాన్ని మీరిబ్బంది పడవద్దు. ఎద్దులమేతకు రాత్రెట్లాగూ బీటికి పోవలసినవాణ్ణే. పోనీ ఇప్పుడే పోతా"నని అన్నకు సమాధాన మిచ్చి కోటొకటి పైన వేసుకుని కొంతరొట్టె చేతబట్టుకొని ధర్మన్న బయటికి పోయినాడు.

## 4.

వీరదాసును పట్టిన పిశాచం ఆరాత్రితో తన పని ముగించుకొని ధర్మన్నను బాధిస్తున్న పిశాచానికి సహాయంగా పోయినాడు. ముందుగా పొలానికి పోయిచూచాడు. ఎంత వెదికినా తనమిత్రుడు కనుపించలేదు. వాడు దూరిపోయిన కలుగు మాత్రం కనబడ్డది. "నిజంగా మావాడికేదో ఆపదమూడింది! మిగత బాధ్యత అంతా నాపైనపడ్డది. పట్టుబట్టి పొలమంతా తున్నివేశాడీ మొండిఘటం! పిచ్చివాడు కాకపోతే వీడికెంత బలం, పట్టుదల యెక్కడనుంచివస్తాయి? ఇక వీణ్ణిక్కడ యెదుర్కొని లాభంలేదు. వీడి తిక్క బీటిలో వదల్చాలి, అక్కడ చూపిస్తాను నామజా!" అని ప్రగల్భాలు పలుకుతూ బీటికి పోయి, అందులో పచ్చిగడ్డి అంతా ధ్వంసమయ్యేటట్లు నీటితో ముంచివేశాడు. ధర్మన్న తెల్లవారుజామునే బీటినుండి ఇంటికి వచ్చి, కొడవలికి పదునుపెట్టుకుని, తిరిగి బీటికి పోయి గడ్డికోత

ప్రారంభించాము. ఒకగుప్పెడు కోసి రెండోగుప్పెడు కోసేటంత లో కొడవలి మొద్దుబారి గడ్డి తెగలేదు. తిరిగి కొడవలి పదును పెట్టవలసివచ్చింది. "ఇక దీనితో ఎంత శ్రమపడినా పని జరగదు. ఇంటికి పోయి పనిముట్లుతీసుకొనిరావలె. వచ్చేటప్పుడే మరికొంత తిండికూడా తెచ్చిపెట్టుకుంటే ఇకయిబ్బంది వుండదు. ఏకంగా ఇక్కడొక వారందినాలుండి పోవలసివచ్చినా సరే, గడ్డికోత పూర్తి కాకుండ ఇంటి మొగం చూడను." అని నిశ్చయించుకున్నాడు ధర్మన్న. ఈమాటలు పిశాచం వింటూనేవున్నాడు. "అబ్బా, వీడిదెంత బిరుసుతల! ఇకవీణ్ణి జయించేదెట్లా? సరే, వీణ్ణి మరొకమాయచేత సాధించాలి" అని పిశాచం అనుకుంటూ వుండగానే ధర్మన్న ఇంటికిపోయి పనిముట్లతో సహా తిరిగి వచ్చి కోతప్రారంభించాడు. పిశాచం అంతకుముందే గడ్డిలో దాగి కూర్చుని ధర్మన్న చేతికొడవలి కదలకుండ పట్టుకోవాలని యెన్నిసార్లో ప్రయత్నించాడు. ధర్మన్న ఈయాటంకాల నెంత మాత్రం లక్ష్యపెట్టక బీటిలోగడ్డి చాలభాగం కోసివేశాడు. ఒకమూల తడిమన్నులో పెరిగివున్నాయి కొన్ని పొడుగైన గడ్డి దుబ్బులు. ఆకొంచెంమేర అపూటకు దిగవిడిచి ఇంటికిపోయినాడు ధర్మన్న. "ఈసారి ఇక్కడ నా చేతులూ కాళ్లూ తెగిపోయినాసరే ఈగడ్డిమాత్రం కోయనియ్యన" నేప్రతిజ్ఞతో ఆదుబ్బులలో చేరి కూర్చున్నాడు పిశాచం. కొడవలి చేతబట్టుకొని మర్నాడు మళ్లీవచ్చాడు ధర్మన్న. గడ్డిమీద కొడవలివేశాడే కాని రెండుపరకలు కూడ చేతికిరాలేదు. పట్టరానిరోషంతో

ఏదిదొరికితే దానినే చకచక శక్తికొద్దీ తెగగొయ్యడం మొదలు పెట్టినాడు. అదిచూడటంతో పిశాచానికి భయంపుట్టింది. ఇక నిదిపనికాదని చెప్పి పిశాచం పక్కనున్న ఒకదట్టమైన దర్భగడ్డి దుబ్బులో దూరి దాక్కున్నాడు. రెండు నిముషాలలో ధర్మన్న వచ్చి ఆదుబ్బుకూడా పట్టుకున్నాడు. ఒక్క కోతతో పిశాచంతోక సగం తెగిపోయింది. గడ్డికోత పూర్తి కాగానే పనలుచేర్చి మోపులుకట్టమని చెల్లెలు పున్నమ్మతో చెప్పి ధర్మన్న కొఱ్ఱచేను కోతకు మరొకపొలానికి పోయినాడు. వెంటనే పిశాచం కూడ అక్కడికి వెళ్ళి కొడవలివాయి మణిగి పోయేటట్లు చేశాడు. ధర్మన్న ఇంటికి వెళ్లి రెండుమూడు కొడవళ్లు, కొన్ని పనిముట్లు తెచ్చి సాయంకాలానికి కొఱ్ఱపంటంతా కోసి పోగుపెట్టినాడు. పిశాచానికి పట్టరాని కోపం వచ్చింది. " ఇప్పటికెట్లాగో గాటుకొని పోయినాడు. ఇంకా గంటికోత ఒకటి రేపటికి దిగబడ్డది. తెల్లవారితే నాసత్తా చూపిస్తాను. " అంటూ కొంత ధైర్యం తెచ్చుకున్నాడు.

మరునాడుదయాన్ని పిశాచం పొలంవద్దకు వచ్చాడు. కానిఅప్పటికే కోతపూర్తి అయింది. చల్లబాటున రాత్రిపూటే పనిచేసి తెల్లవారక ముందే ధర్మన్న కోతపూర్తి చేశాడు. ఆపుకోలేని ఉడుకుబోతుతనం వచ్చింది పిశాచానికి. వెంటనే వెళ్లి కోసిన పనలకింద చేరి వాటిని కుళ్లపెట్టి ధర్మన్నను పరాభవించాలని తలచాడు. కొన్ని పనలట్లా పాడుచేసి పనలమధ్యనే ఒకచోట బడి ఒళ్లు తెలియకుండా నిద్రపోయినాడు. కోసిన పంట

ఇంటికి జేర్చాలనే వుద్దేశంతో ధర్మన్న బండి కట్టుకొని చెల్లెలితో సహా పొలానికి వచ్చాడు. పనలు తీసి కట్టలు కడుతూ పిశాచం పడివున్న పన వద్దకు వచ్చాడు. డొంకికఱ్ఱ గుచ్చి పనను పైకి లాగబోయినాడు. సూదివంటి ఆకఱ్ఱకొన పిశాచం వీపులో దిగి పోయింది. ఆబాధ సహించలేక పిశాచం బిగ్గరగా రోద చేశాడు. ఆయేడ్పు విని ధర్మన్న డొంకికఱ్ఱ పైకెత్తి చూచాడు. ముడతలు పడే శరీరంతో మోండితోకతో కొట్టుకొంటూ బయట పడ్డాడు పిశాచం. వీలైతే తప్పించుకొని పారిపోదామనే యత్నంలో వున్నాడు. "ఓసి, ముద్దూ! మళ్లీ ఇక్కడికి తయారైనావూ!" అన్నాడు ధర్మన్న. "అయ్యా, మొన్న నీకు కనపడ్డవాడు వేరు. నేనింకొకణ్ణి. మేమన్నదమ్ములం. నేను మాఅన్న వీరదాసుతో కొంతకాలముండి వచ్చాను" అని పిశాచం జవాబిచ్చాడు. "ఎవరైతే నేమిలే, పో! నీతమ్ముడికిగత్తే నీకూ కలుగుతుంది, పో!" అంటూ ధర్మన్న పిశాచాన్ని బండి చక్రానికి బెట్టి కొసదామని చేయెత్తినాడు. పిశాచం కెవ్వున కేకబెట్టి యేడుస్తూ "నాయనా నన్ను వదలిపెట్టు. ఇక నీకెన్నడూ హాని తలచను. నీవేపని చెపితే అదల్లా శిరసావహించి చేస్తాను' అని మొరపెట్టుకున్నాడు.

"నీవు చేయుగల పనులేవో చెప్పు" అన్నాడు ధర్మన్న. "నీకు కావలసినంత మంది సైనికులను ఇప్పటికిప్పుడు తయారు చేయగలను" అన్నాడు పిశాచం "సరేకాని, సైనికులెందుకు వుపయోగిస్తారు? అని ప్రశ్నించాడు ధర్మన్న. నీ వేపని

చేయమంటే ఆపనల్లా చేస్తారు' అన్నాడు పిశాచం "పాటలు పాడగలరా వాళ్లు?" అని ధర్మన్న అడిగాడు "ఇంకా సందేహమా? నీవు పాడమంటే పాడ కేం జేస్తారు?" అన్నాడు పిశాచం. "సరేమంచిది. కొందర్ని తయారు చెయ్యి, చూదాం" అన్నాడు ధర్మన్న. అప్పుడు పిశాచం ధాన్యపుకుప్పలోనిది ఒకపన తెప్పించాడు. "నా సేవకుడైన ఈ పిశాచం ఆజ్ఞచొప్పున ఇందులో ఒక్కొక్క గడ్డిపరక ఒక్కొక్క సైనికుడు గావలె" నని కోరుకుంటూ గుప్పెడు గుప్పెడు పరకలు నేలమీద విసరమని ధర్మన్నతో చెప్పినాడు పిశాచం. ఆవిధంగా భటులెందరు కావలిస్తే అందరూ తయారవుతూ వుంటారన్నాడు. పిశాచం చెప్పినట్లు ధర్మన్న పరకలు విసురుతూవుంటే గుంపులు గుంపులుగా యుద్ధభటులు లేచి నిలబడ్డారు. బాకాలు వూదేవాళ్లూ, డోలు తాళం వాయించేవాళ్లూ ముందుగా నిలబడి శ్రావ్యంగా పాడుతూ మిగత దండునంతనూ నడుపుతున్నారు. "బలే తమాషాగా వున్నదిది!" అంటూ ధర్మన్న నిశ్చేష్టుడై నిలబడ్డాడు. ఈపాటికి తన్ను విడిచిపెట్టి పోనియ్యమని పిశాచం ధర్మన్నను వేడుకున్నాడు. "సరే, పోవచ్చుగాని వట్టిగడ్డితోనే సైన్యం తయారుకావలెగాని, తడవ తడవకూ గింజలున్న పన పాడుచేయడం నాకిష్టంలేదు. ఇప్పుడీ పనలో గింజలన్నీ వృధాగా పోయినాయి. పోయిన గింజలు తిరిగి వచ్చే సాధనం కూడ చెప్పు" మన్నాడు ధర్మన్న. "నా సేవకుడు తిరిగి శాసిస్తున్నాడు కనుక సైన్యమంతా తిరిగి గడ్డి పనగా మారిపోవలె'

నని అంటే చాలు, పోయిన పన తిరిగి వస్తుంది" అని పిశాచం జవాబిచ్చాడు. పిశాచం చెప్పినట్లుగా చేశాడు ధర్మన్న. పోయిన గింజలూ గడ్డీ తిరిగి లభించాయి. ఇకనైనా తన్ను వెళ్లిపోనియ్యమని పిశాచం ధర్మన్నను మరి మరి ప్రార్థించాడు. "సరే, పో! ఇకనయినా బుద్ధి కలిగివుంటే భగవంతుడు నిన్ను రక్షిస్తాడ" ని హెచ్చరిస్తూ పిశాచాన్ని విడుదల చేశాడు ధర్మన్న. భగవంతుని పేరు వినగానే ఒళ్లు కంపం పుట్టింది పిశాచానికి. కన్ను మొకటి చేసుకొని భూమిలోదూరి మాయమైనాడు. కలుగు పూడకుండా వుండిపోయింది.

సాయంకాలానికి ధర్మన్న ఇంటికి చేసుకునేటప్పటికి మాణిక్యం, అతనిభార్య వచ్చి ఇంట్లో భోజనానికి కూర్చున్నారు. మాణిక్యం కూడ దివాలా తీశాడు. లెక్కలేని అప్పులు చేసి తీర్చలేకపోయినాడు. అప్పులవాళ్ళ బాధపడలేక రహస్యంగా తమ్ముని యింటికి పారిపోయి వచ్చాడు. ధర్మన్న రావడం చూచి వానితో యిట్లన్నాడు: "తిరిగి నాకేదైనా బ్రతుకు తెరువు కనబడే వరకూ నన్ను, నాభార్యను నీవే కనిపెట్టాలిరా తమ్ముడూ!" "నాకే మభ్యంతరం, అన్నా? మీయిష్టముంటే ఎన్నాళ్లయినా వుండవచ్చు" నంటూ ధర్మన్న కోటువిప్పి గోడ కొయ్యకు తగిలించి తాను కూడ భోజనానికి కూర్చున్నాడు. "అబ్బా! ఈనీచుడితో కూర్చుని తినడమెట్లా?" అంటూ ముఖం ముడుచుకొని గొణగటం మొదలు పెట్టింది మాణిక్యం భార్య. "ఒరే ధర్మన్నా, పోనీ నీవుపోయి వాకిట్లో తిందూ

అన్నా!" అన్నాడు మాణిక్యం. "మంచిదట్లాగే. ఎద్దులమేత కోస మెట్లాగూ రాత్రి బీటికి పోవలసిన వాణ్ణే. పోనీ ఇప్పుడే పోతా" నంటూ కొంత అన్నం కూడా పట్టుకొని వెళ్లి పోయాడు ధర్మన్న.

## 5.

మాణిక్యం వద్దకు పోయి వచ్చిన పిశాచం ఆ రాత్రికే మాణిక్యాన్ని తండ్రియింటికి తరిమి కొట్టినాడు. ధర్మన్న విషయంలో తన మిత్రు లిద్దరికీ సాయపడదా మని బయలుదేరి వచ్చాడు. ముందుగా పంటపొలానికి వచ్చి చూచాడు. ఎంత వెదికినా తనమిత్రుల జాడ దొరకలేదు. ఒకచోట సారంగం మాత్ర మొకటి కనబడ్డది. వెంటనే ఆచోటునుంచి బీటికి వచ్చి చూచాడు. ఒక బురదగుంటలో— ఒకపిశాచానిది— తెగిపోయిన తోక కనుపించింది. కోసిన పొలంలో మోళ్ళ మధ్య మరొక సారంగం కనబడ్డది. తనవాళ్లిద్దరికీ యేదో గొప్ప ఆపద కలిగివుంటుం దనిన్నీ, అయినా తానుమాత్రం అధైర్యం చెందక తనకర్తవ్యాన్ని నెరవేర్చవలసి వుంటుందనిన్నీ నిశ్చయించుకున్నాడు పిశాచం. ధర్మన్న అంతకు ముందే పంటంతా ఒకతావుకు చేర్చాడు. తన అన్నలిద్దరూవచ్చి ఒకేసారి తన యిల్లు ఆక్రమించడం వల్ల ఇల్లు యిరుకయింది. అన్నగార్ల కోరకపైన చెరొక ఇల్లూ కట్టియిచ్చే ప్రయత్నంలో వున్నాడు ధర్మన్న. ఇళ్లకోసం కలప కొట్టే పనిమీద అడవికి వెళ్లినాడు.

పిశాచం ఈసమాచారం విని వెంటనే అడవికి పరుగెత్తినాడు. ధర్మన్న కొట్టే చెట్లమీద తానెక్కి కూర్చుని అడుగడుగున అనేక ప్రతిబంధకాలు కలిగించాడు. బహుకష్టం మీద ధర్మన్న ఒక చెట్టుమొదలు నరికినాడు. ఆచెట్టు సరిగా విరిగి కింద పడక ఒకప్రక్కకు ఒరిగి మరొక చెట్టు కొమ్మలలో చిక్కుకుంది. పిశాచం చేసిన పనేయిది. బహుకష్టంమీద ధర్మన్న చెట్టు చిక్కు వదల్చి కిందికి పడదోశాడు. ఇట్లా చెట్టు చెట్టుకూ పిశాచం తన శక్తంతా చూపి యెన్నో ఆడ్డంకులు కల్పించి బాధించాడు. అంతకు మించిన పట్టుదలతో ధర్మన్న పని చేస్తూ ఎట్లాగో నూరు చెట్లు నరికాడు.

ఆ దినం యాభై చెట్లు కొట్టిరావలె ననే సంకల్పంతో అడవికి వెళ్లినాడు ధర్మన్న. కాని పదిచెట్లు కాకుండానే సాయంకాల మయింది. ధర్మన్న విరామం లేక చెట్లు కొడు తూనే వున్నాడు. చీకటిపడ్డ తరువాత కూడా ఒకచెట్టు కొడుతూ విశ్రాంతికై ఒకనిమిషం కూర్చున్నాడు. పిశాచ మదిచూచి ఇక గెలిచా ననుకుంటూ చెట్టుకొమ్మ మీద కూర్చుని పరధ్యానంగా ధర్మన్న వంక చూస్తున్నాడు. అప్పటి కప్పుడే ధర్మన్న లేచి గొడ్డలి మళ్లీ చేత బట్టినాడు. అడవం తా ప్రతిధ్వనించే టట్లు శక్తికొద్దీ కొట్టడం ప్రారంభించాడు లెక్కనాల్గు దెబ్బలతో చెట్టు పెళపెళ విరిగి పిశాచంతో సహా నేల బడ్డది. అంతట్లో చెట్టు విరిగిపడుతుందని పిశాచం అనుకో లేదు పిశాచం కాలు రెండుకొమ్మల సందున చిక్కుకొని

నలిగిపోయింది. చెట్టుకొమ్మలు నకుకుతూ వుండగా కాలు నలిగిన పిశాచం ధర్మన్న కంట బడ్డాడు. ధర్మన్నకు ఆశ్చర్యం, అసహ్యం తోచాయి. "ఛీ, దుర్మార్గుడా! సిగ్గులేక మళ్లీ వచ్చావూ?" అన్నాడు. "నీ కిదివరలో కనబడ్డది నేను కాను. నేను మరొకణ్ణి. కొంతకాలం మీయన్న మాణిక్యంతో వుండి వచ్చాను." అన్నాడు పిశాచం. "ఎవ రయితే నేమిలే! తగిన శిక్ష అనుభవిస్తున్నావు." అని చెపుతూ గొడ్డలి తిరగబెట్టి చేతి కొద్దీ వేయబోయినాడు ధర్మన్న. పిశాచం దీనంగా యేడుస్తూ క్షమించమని వేడుకున్నాడు. "నన్ను కొట్టకయ్యా బాబూ! నీ బానిస నయి నీవు చెప్పిన పనల్లా చేస్తాను" అన్నాడు. "ఏమి పనులు చేయగలవు నీవు?" అన్నాడు ధర్మన్న. "నీకెంత ధనం కావలిస్తే అంతా యిస్తాను" అన్నాడు పిశాచం. "సరే కొంతధనం తీసుకురా" అన్నాడు ధర్మన్న. "ఇదిగో! ఈచెట్టు ఆకులు కొన్నికోసి వాటిని చేతులతో నలిపివేసరి బంగారం యెంత కావలిస్తే అంతా పోగుపడుతుంది" అని పిశాచం అనగానే ధర్మన్న చెట్టెక్కి ఆకులు తెచ్చినలపడం ప్రారంభించాడు. బంగారు రేకులు ధారగా క్రింద పడటం చూచి ధర్మన్న ఆశ్చర్యభరితుడై ఇట్లన్నాడు: "ఇదేమో, బలేతమాషాయే! పిల్లలు ఆడుకునే టందుకు బాగుంటుంది ఈయాట"

తన నింక విడిచి పోనియ్యమని ధర్మన్నను వేడుకున్నాడు పిశాచం. చెట్టుకొమ్మలమధ్య చిక్కపడ్డ పిశాచాన్ని తప్పించి పైకి లాగి "మంచిది ఇప్పటికైనా బుద్ధి తెచ్చుకొని

సుఖపడు, పో"! అనియంటూ పిశాచాన్ని పంపివేశాడుధర్మన్న. ఈపిశాచం కూడా మిగత యిద్దరివలెనే ఒక సారంగం చేసుకొని భూమిలో దూరిపోయినాడు. సారంగం మాత్రం పూడలేదు.

## 6.

ధర్మన్న కలప కొట్టి తెచ్చి సోదరు లిద్దరికీ ఇళ్లు కట్టి యిచ్చాడు. ఎవ రింట్లో వారే విడిగా కాపుర ముంటున్నారు. ఒక పండుగ దినం వచ్చింది. అన్నలిద్దరినీ తనయింటికి విందుకు పిలిచాడు ధర్మన్న. "పొలం దున్నుకొని బ్రతికే వా ళ్లింటికి మేము రాము" అని చెప్పి తమ్ముని పిలుపు నిరాకరించారు వాళ్లు. అందుమీద ధర్మన్న ఆగ్రామంలో కుటుంబా లన్నిటినీ పిలుచుకొనివచ్చి విందు చేశాడు. పండగపూట కనుక ఆసాయంకాలం గ్రామస్థు లందరూ నడివీధిలో చేరి కూర్చున్నారు. అక్కడ చేరిన స్త్రీలను ఒకపాట పాడమని అడిగినాడు ధర్మన్న. ఎవ్వరూ, ఎన్నడూ చూడని వింత వస్తువు ఒకటి తనవద్ద వున్నదని, బాగా పాడగలిగిన వాళ్ళ కా వస్తువు బహుమాన మిస్తానని చెప్పినాడు. అతని హాస్యపుమాటలకు స్త్రీలు నవ్వుకుంటూ ఒకపాట పాడి "ఏదీ, నీవిచ్చే బహుమానం?" అని యడిగారు. "ఇదిగో కొంచెం వుండండి, ఇప్పుడే వస్తా" నంటూ ధర్మన్న తట్ట ఒకటి చేత బట్టుకొని అడవికి పరుగెత్తినాడు. అది చూచి స్త్రీలు నవ్వుకుంటూ

"ఆమనిషితో మనకేమిటి పోదురూ; పిచ్చివాడు! అతనిచ్చే దేమిటి మనం పుచ్చుకునే దేమిటి? రెండూ లేవు" అని చెప్పు కొని క్రమంగా ఈవిషయమే మరచిపోయి మామూలు మాటలలో పడ్డారు. కొద్దిసేపట్లో ధర్మన్న తట్టెడుబంగారం నెత్తిని బెట్టుకొని పరుగు పరుగున వచ్చి "ఇదిగో ఇదే మీ కిచ్చేది! ఇమ్మంటారా? ఎవరి కెంతకావాలో చెప్పండి" అన్నాడు. "నా కియ్యి, నా కియ్యి" మంటూ అందరూ చుట్టూ మూగి తట్ట కెగబడ్డారు.

తట్టలో చెయ్యి పెట్టి పిడికెడు బంగారంముక్కలు తీసి బయట పారవేశాడు ధర్మన్న. ఒకరి నొకరు తోసుకుంటూ కిందపడ్డ ముక్కలకోసం పెనగులాడటం మొదలుపెట్టినారు ప్రజలు. మగవాళ్లుకూడా వచ్చి ముక్క లేరుకోవటంలో ఒక ముసలమ్మను చావుకు సిద్ధముగా తొక్కేశారు. అది చూచి ధర్మన్న చాలవిచారంతో "అరే, ఇంతబుద్ధిహీనులా మీరు? పాపం ఆముసలిదాన్నట్లా తొక్కేశా రెందుకు? మీ కిది ఇంకా కావలిస్తేనే నిస్తానుగా!" అంటూ మరిరెండు గుప్పెళ్ల బంగారం తీసి వెదజల్లినాడు. ఈసారి ప్రజలగుంపు మరీ పెద్ద దయింది. తట్టలో మిగిలిన రేకు లన్నీతీసి బయట పారవేశాడు ధర్మన్న. ఇంకా తెమ్మంటూ గొడవ చేశా రందరూ "మళ్లీ తెస్తాను మరొకసారి. ఇప్పటి కింతే! ఇదిగో, ఇప్పు డందరమూ కలిసి నృత్యం చేయవలె. మరికొన్ని పాటలు కూడ పాడవలె!" నని ధర్మన్న అందరినీ హెచ్చరించాడు.

తిరిగి స్త్రీలందరూ కలిసి పాడటం ప్రారంభించారు. "అబ్బే! మీ పాటలేమీ బాగుండలే"దన్నాడు ధర్మన్న. ఇంకా మంచి పాట లెక్కడుంటాయి బాబూ?" అన్నారు. స్త్రీలు. "ఇదిగో ఇప్పుడే మీ కది కూడ చూపిస్తాను" అంటూ ధాన్యపుకుప్ప వద్దకు పోయినాడు ధర్మన్న. ఒకపన తీసి, జాగ్రత్తగా గింజలు దులిపివేసి, పిశాచం చెప్పిన సూత్రం ఉచ్చరిస్తూ గడ్డిపరకలు నేలకు విసిరాడు. పరక కొక్కడుచొప్పున పెద్దసైన్యమొకటి తయారయి బారులుతీరి నిలబడ్డారు. బూర వూదేవాళ్లు, డోలు: తాళం వేసేవాళ్లు ముందుండి పాటలు పాడుతున్నారు. పాట పాడుతూ, నృత్యం చేస్తూ వీధి వెంట నడవమని ధర్మన్న సైన్యాని కాజ్ఞ యిచ్చాడు. ఇది చూచి ప్రజ లందరూ ఆశ్చర్యపడ్డారు. తిరిగి యెవ్వరూ చూడకుండా ధర్మన్న ఈ సైన్యాన్ని దొడ్డి దారి బట్టించి, వాళ్లను గడ్డిపరగా మార్చివేసి గడ్డికుప్ప మీద పారవేశాడు. ఈ వేడుక లైనతరువాత ధర్మన్న యింటికి పోయి గుడ్డిపుసాలఅరుగుమీద పడుకొని నిద్రపోయినాడు.

## 7.

ధర్మన్న చేసిన వింతపనులను గూర్చి మర్నాడు ఉదయానికే విన్నాడు వీరదాసు. వెంటనే తమ్ముని వద్దకు చేరి ఇట్లన్నాడు: "ఏమిరా, అబ్బాయీ! నిన్న నొకపెద్దసైన్యాన్ని తయారు చేశా వట. ఎట్లా చేశావో నాకు కూడా కొంచెం చెప్పవూ?" "సైన్యంతో నీ కేమిపని, అన్నా? " అన్నాడు

ధర్మన్న. "అయ్యో సైన్యంతో పని యేమి వుంటుందిరా? సేన చేతిలో వుంటే రాజ్యాలు సంపాదించి యేలుకోవచ్చు" నన్నాడు వీరదాసు. "అట్లాగా? ఐతే ఇంతకు మునుపే ఎందుకు నాతో చెప్పలేదు? నీకెంతసేన కావలిస్తే అంతా క్షణంలో తయారు చేస్తాను. అమ్మాయీ నేనూ మొన్ననే గింజలుకొట్టి మేటుగడ్డి పోగుపెట్టినాము. గడ్డిపరక లుంటే యిక సేనకు కొదు వేమిటి? నీకు కావలసినంత సైన్యాన్నిప్పుడిస్తాను సరే కాని వెంటనే నీవు వాళ్ల నిక్కడనుంచి తీసుకొని పోవాలి సుమా? వాళ్లిక్కడే వుండవలసివస్తే రెండుపూటలలో ఈవూళ్లోవున్న సామగ్రంతా తినివేస్తారు"అన్నాడు ధర్మన్న. భటులను వెంటదీసుకొని వెంటనే ఊరు విడిచి పోతానని వీరదాసు మాట యిచ్చాడు. ధర్మన్న సైన్యాన్ని తయారుచేయడం ప్రారంభించాడు. సందెను గడ్డిపరకలతో ఆవూర నంతా సైన్యంతో నిండిపోయింది. అంతసేనను చూడటంతో వీరదాసుకు పట్టరాని సంతోషం కలిగి "ఇప్పటికి సేన చాలునురా తమ్ముడూ! పోయినబ్రతుకుదెరువు మళ్లీ కల్పించావు." అన్నాడు. "ఇంకా కావలిస్తే మరొకసారి రా. ఎంతసేనయినా క్షణంలో తయారు. ఈకాలంలో మనం గడ్డికోసం వెదుక్కోనక్కర లేదు-మనదొడ్లోనే కావలసినంతవుంది." అన్నాడు ధర్మన్న. వీరదాసు సేనను వెంటదీసుకొనిపోయి, తగిన సైనికోద్యోగులను నియమించుకొని తానే సర్వసైన్యాధిపత్యం వహించి ఇతర దేశాల మీదికి దండెత్తిపోయినాడు. అతడిట్లా గ్రామం వదలి పోగానే

మాణిక్యం నెమ్మదిగా ధర్మన్నవద్దకు వచ్చి, "తమ్ముడూ, నిన్న నెక్కడికో పోయి తెచ్చావట తట్టెడుబంగారం! ఎక్కడిది దొరికిం దేమిరా అది? నాకూ కొంచెం పెట్టుబడివుంటే తిరిగి యేదో బ్రతుకుదెరువు చూచుకుంటానోయి. నావిషయంకూడ కొంచెం ఆలోచించరా, బాబూ!" అన్నాడు. "అయ్యో, ఏకుబంగారం కావా లని నాకు తెలియనే తెలియదే! తెలిసివుంటే ఈవరకే ఇచ్చేవాణ్ణి." అంటూ ధర్మన్న ఈమాత్రం ధైర్య మిచ్చేసరికి మాణిక్యం ఉబ్బిపోయి "ఇప్పటి మట్టుకు మూడుసంచుల బంగారం ఇస్తేనా సరిపోతుం ద" న్నాడు. బండెక్కి ఇద్దరూ అడవికి పోయినారు. ధర్మన్న ఆకులు కోసి తెచ్చి నలపడం ప్రారంభించాడు. బంగారు రేకులు పెద్దపోగుగా పడుతున్నాయి "ఈపోగు సరిపోతుందా?" అని ధర్మన్న అడిగే టప్పటికి మాణిక్యం పట్టరాని సంతోషంతో "చాలు, చాలురా, నాయనా! ఇప్పటి కిది చాలు" నంటూ కృతజ్ఞత వెలిబుచ్చాడు. "ఇంకా కావలసివుంటే మరొకసారి రా. అడవిలో లెక్కలేకుండా వున్నాయి ఈయాకులు" అన్నాడు ధర్మన్న. బంగారం బండిలో యెక్కించి ఇంటికి తెచ్చాడు. అది చేతబట్టుకొని వర్తకానికి బయలుదేరిపోయినాడు మాణిక్యం.

వీరదాసు సైన్యాన్ని తీసుకొనిపోయి రాజ్యం సంపాదించాడు. మాణిక్యం బంగారం పట్టుకొనివెళ్లి వర్తకంద్వారా చాలడబ్బు గడించాడు. ఒకనాడు మాణిక్యం వీరదాసులిద్దరూ ఒకవూళ్ళో కలియడం తటస్థించింది. మాణిక్యంతో

వీరదాసు యిట్లన్నాడు: "నేను రాజ్యమైతే సంపాదించాను గాని నాసైన్యాన్నంతనూ పోషించడానికి చాలినంత డబ్బు నావద్ద లేదు." ఇక మాణిక్యం తనబాధ తాను చెప్పు కున్నాడు. "నేను ధన మేదో గడించానుగాని దాన్ని కాపాడటానికి కావలసిన సిబ్బంది లేదు, నాకిప్పుడు కొందరు రక్షక భటులు చాలా అవసరం" అన్నాడు. తమ కష్టాలు నివారించుకొనడానికి ఇద్దరూ కూర్చుని దీర్ఘాలోచన చేశారు. వీరదాసు కొకఉపాయం తోచి తమ్మునితో యిట్లన్నాడు: "ఇద్దరమూ కలిసి ఇప్పుడు ధర్మడివద్దకే పోదాము, రెండో మార్గం లేదు. నా కని చెప్పి మరికొంత సైన్యం, నీ కని చెప్పి మరి కొంతధనం తీసుకుందాము. నా సైన్యంలో కొంత భాగం నీవు, నీధనంలో కొంత నేను తీసుకుందాము. ఈవిధంగా మన యిద్దరికష్టాలూ తీరగలవు." ఈయుద్దేశంతో తిరిగి యిద్దరూ తమ్మునివద్దకు చేరుకున్నారు. ముందుగా వీరదాసు వచ్చి "ఒరే తమ్ముడూ, నాకు నీ విచ్చినసైన్యం చాలనే లేదు. మరికొన్ని సైనికదళాలు నా కవసరం" అంటూ అడిగాడు. ధర్ముడు తల వూపుతూ "లేదు, లేదు, నీకొరకు ఇక నొక్క సైనికునికూడ చేయను సుమా!" అన్నాడు. "అయ్యో అదేమిటిరా? అవసర మయితే మళ్లీ రమ్మన్నావుగా! జ్ఞాపకం లేదూ?" అని వీర దాసు ప్రశ్నించగా, "అవును, అన్నాను- నిజమే. అయితే నేమి? ఇకమీదట నే నాపని చేయను" అన్నాడు ధర్ముడు. వీరదాసుకు కోపం వచ్చి తమ్ముని తూలనాడటం మొదలు

పెట్టినాడు. అప్పుడు ధర్మన్న "చెపుతాను విను, అయితే నీసై నికులు నిష్కారణంగా మనుష్యులను చంపివేస్తున్నారట. ఇదేమి ధర్మం? మొన్న నొకస్త్రీ తనభర్తశవాన్ని బండిమీద వేసి తీసుకొనిపోతూ, వీరదాసుసైనికులు తనభర్తను యుద్ధంలో చంపివేశారని చెప్పుకుంటూ దీనంగా యేడుస్తూ పోయింది సైనికులను ఆటలకూ పాటలకూ అనుకొని నే నిచ్చానే గాని ప్రాణాలు తీయడానికి కాదు. చాలు, చాలు! ఇది మొదలు నీ కొక్కసైనికునికూడ ఇయ్యాను "అని ఖండితంగా చెప్పివేసి అన్నను చివాట్లు పెట్టి పొమ్మన్నాడు.

వీరదాసు వెనుకనే మాణిక్యం వచ్చి "నా కింకా కొంత బంగారం కావలెరా తమ్ముడూ!" అని లేనిప్రేమ కల్పించుకొని మాట్లాడటం ప్రారంభించాడు. కాని ధర్మన్న తల త్రిప్పుతూ "ఇక నీకోసం బంగారం తయారు చేయ"నని స్పష్టంగా చెప్పివేశాడు. "ఎందుచేతనురా, బుద్ధిహీనుడా? నీయ్యంతటనీవే కదా, కావలిస్తే మళ్లీ రమ్మన్నావు! ఇంతట్లోనే ఏమిటి నీకింత తలతిక్క?" అంటూ తమ్ముణ్ణి ఎదురుక్కన్నాడు మాణిక్యం. "ఏమిటూ? మొన్న నీబంగారంముక్కలే కాదూ, పాపం, మాపొరుగునున్న అన్నపూర్ణ ఆవును దొంగిలించుకొని పోయినాయి!" అన్నాడు ధర్మన్న. "అదెట్లాగురా?" అన్నాడు మాణిక్యం. "ఎట్లాగునా? పిల్లలనోళ్లలో బెడ్డ కొట్టి పాలిచ్చేఆవును, చూస్తూండగా, మొత్తుకొని పోయింది కాదూ నీబంగారం? కొంచెం పాలు పోస్తారా అని అడుగుతూ మొన్న అన్నపూర్ణ

బిడ్డలు మాయింటికి వచ్చారు. ఆవు యేమయిందని నేనడిగి నాను. మాణిక్యం గుమాస్తా ఒకడు వచ్చి మూడు బంగారం ముక్కలు మాఅమ్మచేతిలో పెట్టి మాఆవును తోలుకొని పోయినాడు' అని పిల్లలు జవాబు చెప్పినారు. చిన్నబిడ్డల నీవిధంగా యేడ్పించడానికేనా నీకు బంగారం? నీ కీకబంగారం లేదు వెళ్లు" అని జవాబిచ్చాడు ధర్మన్న.

ఈవిధంగా వీరదాసు మాణిక్యాలిద్దరూ నిరాశ జెంది వెళ్లి పోయినారు. ఇద్దరూ కలిసి తిరిగి యోచన చేశారు. వీర దాసు కొకఉపాయం తట్టి యిట్లన్నాడు: "ఒరే మాణిక్యం! నీ కున్నధనంలోదే కొంత నా కియ్యి. నారాజ్యంలో కొంత భాగమూ కొందరు రక్షకభటులనూ నీకు నే నిస్తాను. మరి గత్యంతరం కనుపించదు. ఏ మంటావు?" మంచి దని చెప్పి అన్న సలహా అంగీకరించాడు మాణిక్యం: ఈవిధంగా అన్నదమ్ము లిద్దరూ ఆస్తులు పంచుకున్నారు. ఇప్పు డిద్దరూ రాజులూ, ఇద్దరూ ధనికులూ కూడ అయినారు.

## 8.

ధర్మన్న ఎప్పటివలెనే చెల్లెలు పున్నమ్మసహాయంతో పొలం పని చేస్తూ తల్లిదండ్రులను సేవిస్తూ కాలం గడుపు తున్నాడు. ఒకనాడు తనఇంటికావలికుక్కకు దెబ్బ తగిలి చని పోవడానికి సిద్ధమయింది. కుక్కస్థితి చూచి ధర్మన్న చాల జాలి పడ్డాడు. రొట్టె కొంతటోపీలో పెట్టుకొనిపోయి కుక్కకు

వేశాడు. వెన కెప్పుడో టోపీమడతలో జాగ్రత పెట్టిన వేరు ముక్కలలో ఒకటి జారి రొట్టెలో పడ్డది. రొట్టెతోపాటు వేరు కూడా తిని వేసింది కుక్క. దానితో పూర్తిగా స్వస్థత కలిగి ఎగిరి గంతులు వేయడం మొదలుపెట్టింది. ధర్మన్న తల్లిదండ్రు లీవిచిత్రం చూచి ఆశ్చర్యపడ్డారు. కుక్కకు పోయేప్రాణం అంత వెంటనే తిరిగి యెట్లా వచ్చిం దని అడిగారు. "నావద్ద రెండు వేరుముక్కలున్నాయి. వాటిమాటే నేను మరచి పోయాను. అది తింటేఎటువంటి జబ్బైనా, బాధైనా నిమి షాలమీద నివారణ అవుతుంది. అది తిన్నది మన కుక్క" అన్నాడు ధర్మన్న.

తరువాత కొన్నిరోజులకు ఆదేశపు రాజుకుమార్తెకు జబ్బువచ్చింది. తనకుమార్తె జబ్బు పోగొట్టగల వైద్యునికి గొప్పబహుమాన మిస్తానని, ఆవైద్యుడు పెండ్లికాని వాడైతే తన కుమార్తెనే యిచ్చి పెండ్లి చేస్తాననీ అన్నిచోట్లా ప్రక టించాడు రాజు. ధర్మన్న తల్లిదండ్రులు కుమారుని పిలిచి "ఒరే నాయనా, రాజుగారి ప్రకటన విన్నావుగా నీవు! నీవద్ద యేదో మందున్న దంటివే, పాపం, రాజుకుమార్తె కియ్యరా పోయి! లే, పోయిరా!" అన్నారు. "మంచిదట్లాగే వెడతా" నని చెప్పి ధర్మన్న రాజ భవనానికి ప్రయాణ మైనాడు. రాజ దర్శనానికి గాను ధర్మన్నకు కొత్తనుస్తులు కట్టబెట్టి పంపి నారు తల్లిదండ్రులు. ధర్మన్న బయలుదేరి పోతూండగా చెయ్యి పరిగిన ముసలమ్మ ఒకతె వీధిలో ఎదురుపడ్డది. "బాబూ, నీ

వద్ద ఏదో మందున్నదని చెప్పుకున్నారు— మహారాజావు, ఈచెయ్యి చూడు నాయనా! దీని బాధ చెప్ప శక్యంకాదు తండ్రీ! నీపేరు చెప్పుకుంటూ బ్రతుకుతానయ్యా!" అంటూ మొరపెట్టుకున్నదామె. "సరే, దానికేమున్నది, విచారించకమ్మా! ఇదిగో, ఇది తిను" మని తనవద్దనున్న వేరుముక్కను ముసలమ్మ చేతికిచ్చాడు ధర్మన్న. ఆమె వేరుతిన్న కొద్ది సేపట్లో బాధ పూర్తిగా నివారణమయి చేయి బాగుపడ్డది.

కుమారుని వెనుకనే తాముకూడా రాజభవనానికి పోదామని ధర్మన్న తల్లిదండ్రులు బయలుదేరి పోతున్నారు. ధర్మన్న తిరిగి యింటికి వస్తున్నాడు. వేరుముక్క ఒకటీ దారిలో ముసలమ్మ కిచ్చి వస్తున్నట్లు విని "ఓరి వెర్రిపిద్దమ్మా! రాజకుమార్తెకంటె బిచ్చమెత్తుకునే ముసలిది నీ కెక్కువయిందా? అని కుమారుని చివాట్లు పెట్టడం ప్రారంభించారు కాని ధర్మన్న రాజకుమార్తె విషయం మరచిపోలేదు. ఆ వృద్ధురాలి అవస్థ కతడెంత జాలిపడ్డాడో రాజకుమార్తె స్థితికి కూడ అంతగా విచారపడుతూనే వున్నాడు. వెంటనే బండికట్టి కూర్చుని తోలడం ఆరంభించాడు. "ఎక్కడికిరా, పోతున్నా" వన్నారు తలిదండ్రులు. "రాజుగారింటికే" నన్నాడు. "ఇంకెందుకు? చేతిలో వున్నమందు కాస్తా ముష్టిదాని కిచ్చి ఊరికే పోయి నీవు చేసేపని యేమిటి?" అని తండ్రి అడుగుతున్నా ధర్మన్న నిలవకుండా బండి తోలుకుంటూ పోయాడు. రాజభవనానికి చేరి గుమ్మంలో అడుగు పెట్టినాడు. రాజు

ఎదురుగా వచ్చి ధర్మన్నను లోపలికి తీసుకొనిపోయినాడు. ధర్మన్నను చూచేసరికే రాజకుమార్తెకు అద్భుతంగా జబ్బు కుదిరి లేచి కూర్చుంది. రాజు ఆనందభరితు డైనాడు. ధర్మన్నకు విలువైన దుస్తులు కట్టబెట్టించాడు. "నాయనా, నీ వెవరవో కాని నేటినుండి మనం బాధువుల మైనాము. నీ వొప్పుకుంటే నాకుమార్తెను నీ కిచ్చి వివాహం చేయడానికి సిద్ధంగా వున్నాను" అని అందరూ వినేటట్లు రాజు చెప్పి వేశాడు. "సరే, మంచి" దన్నాడు ధర్మన్న. ఈవివాహమైన కొలది కాలానికే రాజు చనిపోయినాడు. ధర్మన్నే తరువాత రాజైనాడు. అన్నదమ్ములు ముగ్గురూ యిప్పుడు రాజ్యాధి పతు లైనారు.

## 9.

వీరదాసు, మాణిక్యం, ధర్మన్న ముగ్గురూ ఎవరి రాజ్యాం నా రేలుకుంటూ సుఖంగా బ్రతుకుతున్నారు. వీర దాసు గొప్ప ఐశ్వర్యవంతుడైనాడు. మొదట ధర్మన్న గడ్డితో తయారు చేసి యిచ్చిన సైనికులు గాక ఇం కెందరో యుద్ధ భటులను సంపాదించి అనేక సేనల కధిపతి అయినాడు. తన రాజ్యంలో ప్రజలకు నిర్బంధ సైనిక శిక్ష ఏర్పాటు చేసి ఇంటి కొకడు చొప్పున సైన్యంలో పని చేసి తీరవలెనని శాసించాడు. తన కెప్పుడేది కావలసినా దండించి తీసుకొని రమ్మని సైన్యాన్ని పంపేవాడు. ఎంత దుస్సాధ్యమైన పని యైనా

తాను తెలుసుకున్న తక్షణం నిరాఘాటంగా నెరవేరి తీరవలిసిందే. చుట్టుపట్ల రాజులూ, ప్రజలూ వీరదాసుపేరు చెపితేనే గడగడ లాడేవారు. అంత భయోత్పాతంగా రాజ్యమేలుతున్నాడతడు. మాణిక్యం జీవితం కూడా జోరుగా జరిగిపోతున్నది. ధర్మన్న అడవి యాకులతో తయారుచేసి ఇచ్చిన ధనాన్ని అమితంగా వృద్ధిచేసి చాల ధనికుడైనాడు. తన రాజ్యంలో కట్టుదిట్టమైన పద్ధతులు, శాసనాలు ఏర్పరచాడు. ప్రజలపై రకరకాల పన్నులు విధించి, ప్రతి పైసా నిర్బంధించి వసూలు చేసేవాడు. ప్రతి మనిషికీ తలపన్ను విధించాడు. బండ్లమీద పన్ను, తోటలవెంట నడిచినందుకు పన్ను, ప్రజలు ధరించే చెప్పులజోళ్ళమీద, మేజోళ్ళమీద, విలువైన దుస్తులమీద పన్ను— ఇటువంటి దారుణ మార్గాలెన్నో కల్పించి బలవంతాన్ని డబ్బు లాగేవాడు. మాణిక్యం కోరుకొనడమే తడవుగా కావలసిన వస్తువల్లా వచ్చి ఇంట్లో పడేది. ధనాశచేత అందరూ పోటీలమీద వచ్చి అతని పనులన్నీ శిరసావహించి చేసేవారు.

ధర్మన్న సంసారం కూడ లోటులేకుండ గడిచిపోతున్నది. మామ చనిపోయి, తాను రాజరికానికి వచ్చిన వెంటనే రాజు ధరించే దుస్తులు, ఆభరణాలు, కిరీటం మొదలైన వన్నీ విసర్జించాడు. తానింటివద్ద ఎప్పుడూ వేసుకునే బట్ట, చొక్కా, పల్లెటూరిచెప్పులూ వేసుకొని రాజ్యపరిపాలన ప్రారంభించాడు. "అబ్బా, ఈమధ్యకాలంలో నాకేమీ మనశ్శాంతి

లేకుండా పోతోంది. దినదినం ఒళ్లుబలిసి సోమరితనం ఎక్కు-వౌతున్నది. ఇదివరలో వుండే ఆకలయినా లే దిప్పుడు. రాత్రిలు నిద్రలేదు. ఏమో, ఈదురవస్థ!" అనుకొంటూ కొన్నాళ్లిట్లా తలపోసి తల్లి దండ్రిలను, చెల్లెలిని తన వద్దకే రప్పించుకొని ధర్మన్న ఎప్పటివలె తిరిగి వ్య వ సా య ం సాగించాడు.

"నీవింతగొప్పవాడవే! రాజువే! మహారాజుకుఇదేంపని? పొలందున్నుకోవలసిన అవసరంనీకేల?" అని ప్రజలు ధర్మన్నను ప్రశ్నించారు. "అవునూ! రాజైతేమాత్రం తిండితినవద్దా? పాటుపడకుండా తిండెట్లా వస్తుంది?" అని ధర్మన్న జవాబిచ్చాడు. మంత్రులలో ఒకడు ధర్మన్న వద్దకు వచ్చి "అయ్యా, ఉద్యోగులకు, నౌకర్లకు జీతాలియ్యడానికి ఖజానాలో డబ్బులేదు" అన్నాడు. "డబ్బులేకపోతే, పోనీ జీతాలియ్యడం మానండి!" అన్నాడు ధర్మన్న. "అయితే యెట్లాగు స్వామీ, ఒక్కడు కూడా పని చేయడే!" అన్నాడు మంత్రి. "పోనియ్యండి! పని చేయక పోతే ఇప్పుడు వచ్చే ప్రమాదమేమిటి? ఇక్కడ ఈకచేరీ కొలువు తగ్గిన కొద్దీ బయటికి వెళ్లి ఇంతకంటె ఎక్కువ అవసరమైన పనులు చేసుకునేటందుకు అవకాశం కలుగుతుంది. గ్రామాలలో వున్న పెంటపోగు లన్నీ బండ్లమీద తోలుకొని పోయి పొలాలలో పోసుకో వచ్చునే! మన వీధులూ, బజారులూ, [illegible] మురికితో నిండి అసహ్యంగా వున్నాయో చూచారా? అవన్నీ తుడిచి శుభ్రపరచడం కంటె

మంచిపని మరొక టున్నదా?" అన్నాడు ధర్మన్న. మరొక వంక ఇద్దరు కలహం పెట్టుకొని తీర్పు జెప్పమంటూ రాజు వద్దకు వచ్చారు. "మహాప్రభూ! వీడు నా దబ్బెత్తుకు పోయి నాడండి!" అంటూ అందులో ఒకడు ఫిర్యాదు చేశాడు. ధర్మన్న కొంత విచారణ చేసి "సరే, డబ్బెత్తుకొని పోయి నాడంటే, అందుకు కారణం లేక పోలేదు. వాడు తిండికి గతి లేని దరిద్రుడై నప్పుడు వాడికి సహాయపడవలసిన బాధ్యత నీకు లేదా? నీ విచ్చ్యక పోతే వాడే కొంత తీసుకొని పోయి నాడంటే దోషమేముంది?" అని తీర్పు చెప్పి ఇద్దర్నీ పొమ్మ న్నాడు ధర్మన్న.

ధర్మన్న వట్టి వెర్రివా డని ప్రజలలో వదంతి బయలు దేరింది. "మన మీా యపవాదు బాపుకొనడ మెట్లాగు" నని ధర్మన్న భార్య అతనిని ప్రశ్నించింది. "సరే, కానియ్యి! దాని వల్ల మన కేం నష్టం?" అని ధర్మన్న ఒక్కమాటలో జవాబు చెప్పి ఊరుకున్నాడు. ఈజవాబుతో మొదట రాణి కంతగా మనశ్శాంతి కలుగకపోయినా, దూరాలోచన మీాద ఆమెకు కూడా ధర్మన్నకు పట్టిన పిచ్చే పట్టింది. "భర్తకు ఎదురు చెప్పి నడవటం యేమి ధర్మం? దార మెప్పుడూ సూత్రితో కలిసే నడుస్తూ వుండవలె గదా! ఇంతకూ నాభర్త చేసిన తప్పేమిటి?" అని తలపోసి, అన్నిటిలోను భర్త ననుసరించి బ్రతక డానికే నిశ్చయించుకుంది. ఇక సంశయాలతో కాల యాపన చేయకుండా తాను ధరించే విలువైన దుస్తులు తీసి

వేసి, ముతకబట్టలే కట్టుకుంటూ పున్నమ్మకు శిష్యురా లైంది. దినమంతా ఆమెతో కలిసి పనిచేస్తూ భర్త కన్నివిధాల తోడ్పడుతూ వుండేది.

తెలివితేటలు లెక్కువైన గడుసు వాళ్లందరూ ధర్మన్న రాజ్యం విడిచిపోయినారు. ధర్మన్నవంటి పిచ్చివాళ్లూ, అమాయకులూ మాత్రం ధర్మన్నతోనే కలిసి వుండటానికి నిశ్చయించుకున్నారు. ధర్మన్నతో నిలిచిపోయిన వాళ్లలో ఒక్కరి వద్దనూ డబ్బులేదు. ఒళ్లువంచి పని చేసుకొనడమే విధాయకంగా యెంచుకునేవారు. అన్నవస్త్రాలకు లోటు లేకుండ ఎవరికి వారు సంపాదించుకొనడమేగాక, శక్తిలేని వాళ్ల కింత పెట్టి పోషించడానికి కూడ సమర్థులైనారు.

## 10.

తాను పంపిన బంట్లు తమపని నెట్లా నెరవేర్చుకొని వస్తారో అనుకుంటూ శని యెదురు చూస్తూ కూర్చున్నాడు. అన్నదమ్ములు ముగ్గురూ పూర్తిగా నాశనమైనారనే శుభవార్త యెప్పుడు వినడమని ఉవ్విళ్లూరుతున్నాడు. కాని యెన్నాళ్లకూ తాను పంపినవాళ్ల సమాచారమే తెలియలేదు. ఇక తానే స్వయంగా బయలుదేరినాడు. బీళ్లూ, పొలాలూ తిరిగి తిరిగి విసిగి పోయినాడు. తనసేనల జాడెక్కడా కనుపించలేదు. మూడు సొరంగాలు మాత్రం కనబడ్డవి: “ముగ్గురు మనుష్యులను గెలవలేక - చచ్చు యెుగాలతో పారిపోయి

నారు!» అని తన యనుచరులను నిందిస్తూ యిక తానే స్వయంగా పని జరపవలెనని; లేకుంటే పరువు నిలవదని నిశ్చయించుకొని, అన్నదమ్ములు ముగ్గుర్నీ వెదుకుతూ పోయాడు. అయితే వారిప్పుడు పూర్వపు చోట్లగాని పూర్వస్థితిలో గాని లేరు. ముగ్గురూ మూడు రాజ్యాలకు అధిపతులయి యుండటం చూచాడు. లోలోపల మండి పడుతూ, "సరే, చూస్తాను! నాప్రయత్నం లోపం లేకుండా పనిచేస్తాను. ఇంతటితో వీళ్లను విడుస్తానా? — నేనా!" అని దృఢనిశ్చయం చేసుకున్నాడు.

శని ముందుగా వీరదాసు ఏలే రాజ్యంలో ప్రవేశించాడు. పెద్ద సేనాధిపతి వేషంతో వెళ్లి రాజును కలుసుకున్నాడు. "అయ్యా, మీరు గొప్పయుద్ధవీరులని దేశ దేశాలలో ప్రసిద్ధి. నాకూ కొంత యుద్ధనైపుణ్యమూ, అనుభవమూ వున్నది. మీసైన్యంలో చేరి, మీసేవ చేయగోరి మీ దర్శనార్థం వచ్చాను" అన్నాడు వీరదాసుతో. వీరదాసు ఈ కొత్త మనిషిని అనేక విధాల పరీక్షించాడు. తన కొలువులో పనిచేయడానికి తగినవాడని స్థిరపరచుకొని వెంటనే తనసేనకు అధిపతిగా నియమించాడు. కొత్త సైన్యాధిపతి ఉద్యోగం పుచ్చుకోగానే మొదటిరకం సేనను తయారుచేయుడ మెట్లాగో వీరదాసుకు బోధించడం ప్రారంభించాడు. "అయ్యా! మన సేనను వృద్ధి పరచడమే మన మిప్పుడు చేయవలసిన పని. పనిలేకుండా తిరిగే వాళ్లెందరో ఈ రాజ్యంలో వున్నారు.

యువకులలో ప్రతి ఒక్కణ్ణి సైన్యంలో చేర్చవలె. అప్పుడు మన సైన్యం ఇప్పటికంటె అయిదురెట్లు పెరుగుతుంది. మన కున్న తుపాకులు, ఫిరంగులు కూడ చాల తక్కువ. కొత్త వెన్నో తెప్పించవలె. ఇంతవర కెవ్వరికీ తెలియని కొత్త మాదిరి తుపాకి ఒక టున్నది. దాన్ని కవిూ వట మన యుద్ధాలలో ప్రవేశపెడదా మనుకుంటున్నాను. ఒకసారి నూరుగుళ్లు పేల్చగలిగే కొత్తరకం ఆయుధ మది. మనుష్యులనూ గుర్రాలనూ మాత్రమే కాదు, దుర్భేద్యమైన ఇనుప కోటలను కూడ పిండిపిండి చేసే తుపాకి అది. అవి కొన్ని మనకుంటేనా శత్రుపక్షమంతా ధ్వంసమే!

కొత్త సేనాధిపతి ఇచ్చిన సలహాను వీరదాసు అతి శ్రద్ధతో విన్నాడు. వెంటనే దేశంలో యువకు లందరూ విధిగా సేనలో చేరి పనిచేయాలని తాఖీదు వెళ్లింది. సేనాధిపతి చెప్పిన కొత్తమారణ యంత్రా లన్నీ తయారు చేయడానికి రెండు ఆయుధ కర్మాగారాలు స్థాపింపబడ్డవి. ఈపని యిట్లా జరుగుతూవుండగానే సరిహద్దురాజ్యం విూద యుద్ధం ప్రకటించాడు వీరదాసు. సేనలు రెండూ యుద్ధభూమిలో యెదురెదురుగా నిలిచాయి. శత్రుసైన్యంవిూద అగ్నివర్షం కురిపించవమని వీరదాసు తనసేన కాజ్ఞ యిచ్చాడు. శత్రువులలో సగం మంది నిల్లా కాల్పించి చంపించాడు. శత్రురాజు వీరదాసుకు లోబడి తన రాజ్యాన్ని కూడా వదలుకున్నాడు. కాని ఈ జయంతో తృప్తి కలుగలేదు వీరదాసుకు. మరొక

యుద్ధం తలపెట్టినాడు. వెనుక తన నోడించిన మరొక రాజుని కూడా ఈ వేడిలోనే అణచి రాజాలేనని నిశ్చయించుకొని దాడి సాగించాడు. కాని ఆరాజు వీరదాసు చేకూర్చుకునే బలాన్ని ఎప్పటికప్పుడు కనిపెడుతూనే వున్నాడు. వీరదాసు కున్న ఆయుధాలను మించిన వాటి నన్నిటినీ తానంతకు ముందే తయారు చేయించి నిర్భయంగా కూర్చున్నాడు. ఈరాజు పురుషులనే గాక స్త్రీలనుకూడ సైన్యంలో చేర్పించి వీరదాసు సేనకు నాలుగు రెట్లు సేనను తయారుజేసి వుంచాడు. ఇదిగాక పైనుండి శత్రువులమీద "బాంబులు" విసిరే వాయు విమానాలు కూడ యీరాజు కున్నవి. కనుకనే వీరదాసు తెచ్చిన సేన సరిహద్దు రాష్ట్రం మీద చేసిన పనిలో నూరో వంతైనా యిక్కడ చేయలేకపోయింది. కొద్దిసేపట్లోనే తన సైన్యమంతా చెల్లాచెదరై పారిపోయారు. తానూ ప్రాణం దక్కించుకొని పారిపోయినాడు. వీరదాసు రాజ్యమంతా శత్రువశ మయింది.

వీరదాసుతో పని పూర్తి చేసుకొని శని మాణిక్యం రాజ్యంలో ప్రవేశించాడు. వర్తకుని వేషం వేసుకొని పెద్ద పెట్టుబడిధనంతో వ్యాపారం మొదలుపెట్టి మాణిక్య మున్న వూళ్లోనే నివాస మేర్పరచు కున్నాడు. అందరికంటె ఎక్కువ ధరలిచ్చి దేశంలో సరుకంతా ఖరీదు చేసేవాడు. ధనాశ చేత అందరూ వచ్చి తమ సరుకులన్నీ ఈ కొత్తవర్తకునికే అమ్మి పోతున్నారు. ఈవిధంగా ప్రజలవద్ద అమితంగా డబ్బు చేరింది.

రాజుకు చెల్లవలసిన పన్నులు మాత్రం అడగడంతోనే చెల్లిస్తూ వుండేవాళ్లు. తనరాజ్యంలో ఈవర్తకుడు నివాసముండటమే తన కింతగా లాభిస్తుందని, ఈవిధంగా ప్రజలవద్దను, తనఖజానాలోను ధనం పూర్తిగా నిండివుంటున్నదని ఆనందిస్తున్నాడు మాణిక్యం. ఒకసారి మాణిక్యం పెద్ద మేడ ఒకటి కట్టించాలని తలపెట్టినాడు. దానికి కావలసిన సామగ్రంతా తెచ్చి, వెంటనే మేడ పూర్తి చేయుమని చెప్పి ప్రజలందరికీ కబురు చేశాడు. కాని చుట్టుపట్ల నున్న మంచి మంచి కలప, రాయి అంతకుముందే వర్తకుడే ఖరీదు చేశాడు. కూలీలు యావన్మంది కూడ వర్తకునిపనిలోకే పోయినారు. ఇదివిని మాణిక్యం కూలిరేటు హెచ్చించాడు. అంతకంటె ఎక్కువ యిస్తానని వర్తకుడు పోటీ పెట్టినాడు. మాణిక్యం చాల ధనికుడని పేరుపొందినవాడు. కాని వర్తకుడు ప్రతివిషయంలోనూ మాణిక్యాన్ని మించి, అతని ఊరూ పేరూ లేకుండా చేశాడు. కొన్నాళ్ల తరువాత మాణిక్యం ఫలవృక్షాలతోట ఒకటి నాటించాలని సంకల్పించి కూలీలను రమ్మన్నాడు. ఒక్కడూ రాలేదు. అదే సమయంలో వర్తకు డొక చెరువు తవ్వించడం ప్రారంభించాడు. కూలీలందరూ ఆపనికే పోయినారు. కూలి యెంత యిస్తానన్నా మాణిక్యం పని కొక్కడూ దొరకలేదు. శీతకాలంలో మాణిక్యాని కొక ఉన్నికోటు కావలసి కొని తెమ్మని బజారుకు పంపగా ముచ్చ కైనా ఒక్క ఉన్నిగుడ్డ దొరకలేదు. చుట్టుపట్ల ఉన్నియంతా తివాసులు నేయించడానికి వర్తకుడే ఖరీదు చేశాడని తెలిసింది

వచ్చింది. మరొకసారి మాణిక్యానికి కొన్ని గుఱ్ఱాలు కావలసి కొనమని డబ్బిచ్చి పంపించాడు. పోయినవాళ్లు పోయినట్లే తిరిగివచ్చారు. దేశంలో గుఱ్ఱాలన్నిటినీ వర్తకుడే కొనివేశాడని, వర్తకుడు తవ్వించిన చెరువు నింపడానికి గుఱ్ఱాలు నీళ్లు మోస్తున్నాయని తెలిసింది. ఈవిధంగా మాణిక్యం తలపెట్టిన పనులన్నీ మూలబడ్డవి. ధనవర్షం కురిపించి దేశంలో వుండే ప్రజలనూ, సరుకులన్నిటినీ వర్తకుడే కొనివేశాడు. వర్తకుని వద్ద ప్రజలు సంపాదించిన ధనంలోనుంచి రాజుకు రావలసిన పన్నులుమాత్రం చెల్లుతూ వుండేవి. పన్నులిచ్చివేయడంతో ప్రజలకూ మాణిక్యానికి వుండే సంబంధం తీరిపోయేది. మాణిక్యం వద్ద పన్నుల రూపంగా లెక్కలేనంత ధనం మాత్రం చేరుతూ వచ్చింది. కొట్లు నిండేటంత ధనమున్నదే కాని అతడు తలపెట్టిన పని మాత్రం ఒక్కటీ నెరవేరలేదు. పోనీ, ఇకమీదట కొత్తపను లేవీ తలపెట్టకుండా సంసార సుఖంగా బ్రతుకుదామనుకున్నా అదీ సాగేటట్లు కనుపించలేదు. క్రమంగా జరుగుబాట్లన్నీ పోయి నీరసస్థితికి వచ్చాడు. ఇంట్లో వంటవాళ్లు, నౌకర్లు సహితం ఇక్కడ పనిమానుకొని పోయి ఒక్కొక్కడే వర్తకుని వద్ద చేరినారు. మాణిక్యం ఇంట్లో చివరకు తిండికే గతిలేక పోయింది. బజారు సరుకులన్నీ ఎప్పటికప్పుడే వర్తకుని యింటికి చేరిపోతున్నాయి. రాజుకియ్య వలసిన పన్నులు మాత్రం తెచ్చి యిచ్చి పోతూ వుండేవారు ప్రజలు.

ఈస్థితి చూచుకొని మాణిక్యానికి పట్టరానికోపం, దుఃఖం వచ్చింది. అంతకంతకు బ్రతుకు దుర్భరమై వరుసగా కొన్ని దినాలు తిండిలేక మాడవలసివచ్చింది. ఇక రేపో యెల్లుండో వర్తకుడు రాజునే కొనేస్తాడనే వదంతి బయలుదేరింది. ఈమాటలతో మాణిక్యానికి విపరీత భయం పుట్టింది. ఈయాపద యెట్లా గడవాలో తెలియలేదు. ఈసమయంలో వీరదాసు మాణిక్యంయింటికి వచ్చాడు. తన కష్టాలు చెప్పుకొని తన కేదైనా సహాయం చేయమని ప్రార్థించాడు. మాణిక్యం స్థితి అతని కేం తెలుసును, పాపం! "అన్నా, నా అవస్థ ఎవరితో చెప్పుకోను? మూడు దినాలయింది నే నన్నం తిని. బిచ్చమెత్తినా తిండి దొరికేటట్లు లేద"ని చెప్పి ఏడ్వటం మొదలు పెట్టినాడు తమ్ముడు.

## 11.

పెద్దవాళ్లిద్దర్నీ ఇట్లా పాడుచేసి శని ధర్మన్న వద్దకు కూడా ఒక సేనానివలె దొంగవేషం వేసుకొని వచ్చాడు. "ఏరాజ్యంగాని మంచి సేన లేనిదే రాజ్య మనిపించుకోదు. మీ రొప్పుకుంటే మనుష్యులను పోగుచేసి అసలయిన సైన్యాన్ని తయారు చేస్తా"నని ధర్మన్నతో చెప్పినాడు. "సరే మంచిది! వెంటనే సైన్యాన్ని కూర్చి వాళ్లకు బాగా సంగీతం నృత్యం నేర్పవలె. పాటలంటే నాకు చాలా యిష్టం"అన్నాడు ధర్మన్న.

సైన్యంలో భటులను చేర్చడానికి శని ధర్మన్న యొక్క రాజ్య మంతటా తిరుగుతూ అందరూ వచ్చి సైన్యంలో చేరి తీరవలెనని ఊరూరా ప్రజలను హెచ్చరించాడు. సేనలో చేరే ప్రతివానికీ ఒకసీసా సారాయి టోపీ ఒకటి బహుమాన మిస్తా నన్నాడు. ఈమాట విని ప్రజలు సేనాధిపతినిచూచి నవ్వుతూ "సారాయి మా కెందుకు? ఇక టోపీలా— రంగు రంగులవి, రక రకాలవి మాయిళ్లలో మే మే తయారు చేసుకోగలం. ఒక్కడు కూడ సైన్యంలో చేరేదిలేదు" అని చెప్పి పొమ్మ న్నారు. ఇంతటితో శని లోలోపల లజ్జపడుతూ తిరిగి ధర్మన్న వద్దకు వచ్చియిట్లన్నాడు: "మీరాజ్యంలో ప్రజలింత బుద్ధి హీనులేమి? కోరుకొని సైన్యంలో చేరే వా డొక్కడూ కను పించడే! అందరూ విధిగా చేరేటట్లు మనమే ప్రయత్నించాలి" నరే అట్లాగే ప్రయత్నం చేసి చూడ మన్నాడు ధర్మన్న. శని తిరిగి ప్రజలవద్దకుపోయి దేశంలో ప్రతిపౌరుడూ సైన్యంలో చేరితీరవలె నని, అట్లా చేరనివాళ్లందరికీ మరణదండన విధింప బడే టట్లు ధర్మన్నగారి ఆజ్ఞ అయి దనీ చెప్పడం ప్రారంభిం చాడు. ఈమాట విని ప్రజలలో కొందరు సేనాధిపతివద్దకు వచ్చి "ఏమయ్యా! సైన్యంలో చేరకపోతే రాజుగారు మ మ్మొం దర్నీ చంపుతా డని చెపుతున్నావే, సైన్యంలో చేరితే వచ్చే లాభం యేమో కొంచెం చెప్పు. ఎదటివాళ్లను చావకుం డేటుం టే తాము చావడం—ఇదేకాదూ సైనికులు నేర్చుకునే విద్య? నిజమేనా?" అని అడిగారు. "అవును, కొంద రప్పు డప్పుడు

చస్తే చావనూవచ్చు!" అన్నాడు శని. "అట్లైతే మే మెవ్వరమూ సైన్యంలోకి పోనేపోము. ఎప్పుడో ఒకప్పుడు ఎట్లాగూ చచ్చేది వుండనే వున్నది. కనుక ఇంటివద్దనే చనిపోవచ్చు. సైన్యంలోకి పోయి చావడ మెందుకు?" అన్నారు ప్రజలు. "ఓరీ మూర్ఖులారా! ఇంతటి అజ్ఞానం మరెక్కడనూ వుండదు! ఒకొక్క సైనికు డెప్పుడైనా చనిపోవచ్చు, లేక చనిపోక పోవచ్చు ఏది యెట్లయినా ఇప్పుడు మాత్రం మీరు రాజు ఆజ్ఞ నిరాకరిస్తే మీకు చావు తప్పదని తెలుసుకోండి" అంటూ శని శత విధాల ప్రజలను బెదిరించాడు.

అప్పుడు ప్రజల కేమీ తోచక రాజువద్దకు వచ్చి, "అయ్యా, అత డెవరో వచ్చి సేనాధిపతి నని చెప్పుకుంటూ ప్రజలందరూ సైన్యంలో చేరితీరవలె నని నిర్బంధిస్తున్నాడు; అట్లా చేరకపోతే మాకందరకీ మీ చేతిలో చావు తప్పదట ఇదేమండి స్వామీ?" అన్నారు. ధర్మన్న నవ్వుతూ యిట్లన్నాడు. "నే నొక్కణ్ణే ఇంతమంది నెట్లా చంపగల నను కున్నారు మీరు? ఇదేమో నాకే బోధపడటం లేదే!" ఈ మాటమీద కొంత ధైర్యం తెచ్చుకున్నారు ప్రజలు. "అట్లైతే మాకేం భయం? మే మెన్నడూ సైన్యంలో చేరనే చేరము" అన్నా రందరూ. "సరే చేరకండి! మిమ్మల్ని బలవంత పెట్టే దెవరు?" అన్నాడు ధర్మన్న. అప్పుడు ప్రజలు నిర్భయంగా సేనాని వద్దకు పోయి, ఏమైనా సరే ఒక్కడు కూడా సైన్యంలో చేరేది లేదు పొమ్మని చెప్పివేశారు.

ఈజవాబుతో తని పెట్టుకున్న ఆశలన్నీ భగ్నమై పోయి నాయి. పట్టరాని దుఃఖంతోనూ, కోపంతోనూ పక్కనున్న మరొక రాజ్యానికి తక్షణమే పోయి ఆదేశపు రాజుతో స్నేహం చేసుకున్నాడు. "మన మిప్పుడే పోయి ధర్మన్న మీదికి దండెత్తవలె. ఆదేశంలో డబ్బెక్కడనూ కనుపించదు. ధనమొక్కటి లేకపోతే మాత్రం లోటేమిటి మనకు? కావలసినంత ధాన్యం, లెక్కకుమించిన పశువులమందలు, ఇంకెన్నినో సరుకులు సమృద్ధిగా వున్నాయి" అని చెప్పి ఆరాజును ధర్మన్నమీదికి పురికొల్పినాడు. ఈమాట పుచ్చుకొని అతడు పెద్దసైన్యంతో బయలుదేరి వచ్చి ధర్మన్న రాజ్యంలో ప్రవేశించాడు. ప్రజలలో కలవరం బయలుదేరి పెద్ద దండు ఒకటి తమమీదికి వస్తున్నదని రాజుకు తెలియపరచారు. "వస్తే మనకేమి? రానియ్యండి!" అన్నాడు ధర్మన్న. శత్రురాజు కొంత దూరాన్ని తనసైన్యాన్ని నిలిపి, ధర్మన్న సైన్యం ఎక్కడున్నదో చూచిరమ్మని వేగులవాళ్ళను పంపించాడు. వాళ్లు వచ్చి చూచారేగాని దేశంలో యే మూలనూ సైన్య మున్న సూచనే కనబడలేదు. ఇట్టి స్థితిలో యుద్ధం చేసే దెవరిమీదనో శత్రువులకు తెలియలేదు. గ్రామాలమీదపడి ప్రజల సొత్తును దోచుకోమని శత్రురాజు తన సైన్యాని కాజ్ఞయిచ్చాడు. తండోప తండాలుగా శత్రుసేన గ్రామాలలో ప్రవేసించింది. స్త్రీపురుషు లందరూ బయటికి వచ్చి ఆశ్చర్యంతో సైన్యం వంక చూస్తూ నిలబడ్డారు. ప్రజల ధాన్యాన్నీ, పశువులనూ

వశపరచు కుంటున్నారు సైనికులు. శత్రువుల కడ్డువెళ్ళకుండా ఇష్టం వచ్చినట్లల్లా దోచుకో నిచ్చారు ప్రజలు. ఇట్లా కొన్ని దినాల వరకూ శత్రుసేన యధేచ్ఛగా గ్రామం తరువాత గ్రామం దోచుకుంటూనే వున్నారు. వాళ్లకు కావలసిన దల్లా పట్టుకు పోనిచ్చారేగాని ప్రజలలో ఒకడు కూడా వాళ్ళ కడ్డువెళ్ళలేదు. ప్రతి వూళ్లోనూ ఇట్లాగే జరిగింది. "అయ్యో, ఎందుకయ్యా, పాపం, మీకింత శ్రమ? మీదేశంలో తిండి లేకపోతే లేచివచ్చి ఇక్కడనే మాతోపాటు సుఖంగా కాల క్షేపం చేయకూడదా?" అంటూ సైనికులను బతిమాలినారు ప్రజలు. నాలుగు దినాలిట్లా గడిచేసరికి తాము చేసే పనిలో తమకే సంతోషం లేకపోయింది శత్రువులకు. ఎదురొక్కనే వాడొక్కడూ కనబడక వాళ్లలో ఉద్రేకమంతా నశించింది. "ఈదేశంలో మే మిక యుద్ధం చేయలేము. ఇటువంటి దండ యాత్ర మే మెన్నడూ కనివిని యెరుగం. ఇక్కడ భోజనపుపని తప్ప మరేదీ కనుపించదు. మమ్మి మరొక శత్రువుమీదికి పంపండి" అంటూ పోయి తమరాజుతో మొరబెట్టుకున్నారు సైనికులు. రాజుకు చాల కోపం వచ్చింది. ప్రజలయిళ్లూ, ధాన్య పుకొట్లూ సమస్తం తగలబెట్టి పశువులమందలను చంపివేయ మని శత్రురాజు తనసైన్యాన్ని తిరిగి పంపించాడు. తనఆజ్ఞ నుల్లంఘించిన వాళ్ళ నందర్నీ ఉరితీయిస్తానని భయపెట్టినాడు. సైనికుల కీ పని యేమాత్రం యిష్టంలేక పోయినా రాజుకు భయపడి పశువులను చంపుతూ, ఇళ్ళూ, ధాన్యపుకుప్పలూ

తగల బెడుతూ పోయినారు. వాళ్లెంత హింసపెట్టినా ప్రజ లేమాత్రం తిరుగుబాటు చేయ లేదు. సైనికుల దారుణ కృత్యాలు కళ్లతో చూడలేక బాధతోనూ, జాలితోనూ యేడ్వటం మొదలు పెట్టినారు. ముసలివాళ్లు, స్త్రీలు, పిల్లలు అందరూ కన్నీరు కార్చారు. సైనికుల దుండగాలు చూచి భరించలేక ప్రజలు వాళ్లతో "ఎందుకు నాయనా, మమ్మిట్లా బాధించడం? ఇంత అందమైనవి, ఇంత ఉపయోగకరమైనవి, ఇన్ని వస్తువు లిట్లా తగలబెట్టి పాడు జేయడం మీకేమిసంతోష మయ్యా? పోనీ, మీ కవసరముంటే ఇవన్నీ మీరే తీసుకొని పోరాదా?" అనేవారు. ప్రజలు పొందే బాధ, వాళ్ల అమాయ కత్వం చూచి సైనికులు వాళ్ల యెదుట నిలబడలేకపోయి నారు. సేనాధిపతి ఆజ్ఞను కూడా తిరస్కరించి ఇకముందుకు పోయేది లేదని చెప్పి ఎక్కడి వాళ్ళక్కడే చెల్లాచెదరై పారి పోయినారు.

## 12.

ఇప్పటితో పూర్తిగా విసుగెత్తింది శనికి. ఇక తన ప్రయత్నమంతా వదలుకో వలసినట్లు కనుపించింది. దేశం మీదికి దాడి నడిపి ధర్మన్నను లొంగతీయాలని ఎత్తిన పన్ను గడ పూర్తిగా భగ్నమయింది. ఇక నిది పనికాదనుకున్నాడు. ఈ సారి ధనికుని వేషం వేసుకొనివచ్చి ధర్మన్నరాజ్యంలో నివాస మేర్పరచుకున్నాడు. ధనకాంక్ష గల్పించి ధర్మన్నను

మట్టుపెట్టాలని సంకల్పించుకొని వచ్చాడు. "నాశక్తివంచన లేకుండ మీకూ మీదేశానికి సేవచేసే వుద్దేశంతో వచ్చాను. ఈదేశపు వర్తక వ్యాపారం వృద్ధిచేసి ప్రజలకు సుఖం చేకూర్చడమే నాఆశయం" అని ధర్మన్నతో అన్నాడు. "మంచిది! అందుకు అడ్డ మేముంటుంది? నీ కిష్టమైతే మా తోనే కాపురముండవచ్చు" నన్నాడు ధర్మన్న.

వర్తకుడు మరునాడుదయాన్నే ఒక పెద్ద సంచినిండ బంగారం మోయించుకొని బజారువీధికి వచ్చాడు. ప్రజలు తన చుట్టూ గుమిగూడటం చూచి "మీ రందరూ జ్ఞానశూన్యులై పశువుల్లాగున బ్రతుకుతున్నారు. మీకు చక్కని బ్రతుకుదెరువు చూపించడానికే నే నిక్కడికి వచ్చాను. ఇదిగో! ఈబంగార మందుకొరకే తెచ్చాను" అని ఆశపెడుతూ, బంగారం మూట అందరి యెదుటనూ ప్రదర్శించాడు. బంగారాన్ని ప్రజలందరూ వింతగా చూచారు. ధర్మన్న రాజ్యంలో బంగారు వెండి నాణెములవాడుక లేదు. పంటదినుసులు, తదితర సామగ్రి అవసరాన్నిబట్టి ఒకటిచ్చి మరొకటి పుచ్చుకొనడమే కాని డబ్బుకు వస్తువులు అమ్మడం గాని, కొనడంగాని అమలులో లేదు. ఒకరిపని ఒకరు చేసిపెట్టడం ద్వారా బాకీలు తీర్చు పెట్టుకొనే పద్ధతి కూడా వుండేది ప్రజలు వర్తకుని చుట్టూ మూగి నిలబడి "ఈసంచిలో వస్తువులు బలే తమాషాగా వున్నాయి! ఏమిటయ్యా, యివి?" అని యడిగారు. కొందరు తమ ఇళ్లలో వస్తువులు తెచ్చి యిచ్చి కొన్ని బంగారుముక్కలు కొను

కుక్కున్నారు. మర్నాడు వర్తకుడు బస్తాలకొలదీ బంగారం మోయించుకొని వచ్చి అతి చవకగా ఇయ్యడం మొదలు పెట్టినాడు. ఆదినంకూడ కొందరు బంగారుముక్కలు పుచ్చుకొని వర్తకునికి కావలసిన పనులు చేసిపెట్టినారు. ప్రజలలో కలుగుతూన్న ఈ బంగారువ్యామోహం కనిపెట్టి తిరిగి కొంతధైర్యం తెచ్చుకున్నాడు శని. "ఈసారి నాకు జయం తప్పదు. ప్రజలందరూ నాపక్షం మవలంబించి పనిచేస్తున్నారు. మాణిక్యం నాశన మయినట్లే ఇక రెండుదినాలలో వీణ్ణికూడ బంగారానికి బానిసను చేసి ధ్వంసం చేస్తాను." అని తనకు తాను ధైర్యం చెప్పుకున్నాడు. ప్రతివానిచేతికీ కొన్ని బంగారంముక్కలు చేరగానే వాటినింటికి తీసుకొనివెళ్ళి దండలుకట్టి మెడలో వేసుకోమని చెప్పి ఇళ్ళవద్ద స్త్రీల కిచ్చారు. కొన్నింటిని ఆడపిల్లలు జడలో వేసి అల్లుకునేవారు. ఇంకాచిన్నపిల్లలు కొన్నిటిని ఆటవస్తువులుగా తీసుకొని వెళ్లి వీధిలో ఆడుకునేవారు. ఇట్లా ప్రతి యింట్లోనూ చాలా ముక్కలు పోగుపడ్డవి. కొన్ని దినాలిట్లా గడచిన మీదట ప్రజలకు వాటిమీద విసుగుపుట్టింది. తరువాత వర్తకుని వద్ద అవి పుచ్చుకొనడమే మానివేశారు. వర్తకుడు దేశంలోవున్న ధాన్యాన్ని, పశువులనూ బంగారమిచ్చి కొనివేయాలని తలిచాడు కాని, తరువాత ఒక్కడు కూడా తనవద్దకు రాలేదు. చిన్నపిల్లలు ఎప్పుడో యే కోడిగుడ్డో ఒకటి వర్తకుని కిచ్చి ఆడుకొనేటందుకు కొంత బంగారుముక్క తెచ్చుకునేవారు. క్రమంగా వర్తకునికి తిండి కూడా

దొరకడం కష్టమయింది. ఒకనాడు తిండి కేదైనా కొనుక్కుందామని శని వీధివెంట బయలు దేరినాడు. ఒకయింటికి వచ్చాడు. ఒకకోడి నిస్తే బంగారు నాణె మిస్తానని బేరం పెట్టినాడు. "ఇక బంగారం మా కక్కరలేదు పో, నాయనా! ఇప్పటికే మాయింటినిండా కావలసినన్ని ముక్కలుపడి దొర్లుతున్నాయి" అని చెప్పి వర్తకుని వెళ్లిపొమ్మన్నది ఆయింటి స్త్రీ. వర్తకుడు మరొక యింటి గుమ్మంవద్ద నిలిచి "బంగారు నాణెమిస్తే కొంచెం అన్నం దొరుకుతుందా?" అని యడిగాడు "మాకొద్దయ్యా! బంగారంతో మాకేం పని? మాయింట్లో ఇప్పు డాడుకునే పిల్లలుకూడా లేరు. ఇప్పటికే పది పదిహేను ముక్కలు యింట్లో పడివున్నాయి. ఇంకా పుచ్చుకొని యేం జేసుకునేది? వద్దు వెళ్లిపొ" మ్మన్నది ఆయిల్లాలు. ఆయిల్లు విడిచి మరొక యింటికి పోయినాడు ఈమోసగాడు. "ఖరీదుకు కాస్త గంజి దొరుకుతుందయ్యా?" అని యడిగాడు. ఆయింటి యజమాని బయటికి వచ్చి "నీబంగారం మాకు వద్దు. అన్నమో దేవుడా అని బాధపడుతున్నావు కనుక కొంచెం సేపిక్కడ నిలు; ఏమైనా వున్నదేమో ఇంట్లో అడిగివస్తా" నన్నాడు. దేవుడనే మాట చెవిని బడగానే శనికి కంపం పుట్టింది, క్షణ మాగకుండా పారిపోయాడు. ఎన్నిళ్లు తిరిగినా కొంచెం గంజైనా పుట్టలేదు. "ఇక నీబంగారం మాకొద్దు తెస్తే మరేదైనా తీసుకొనిరా. లేకుంటే మాతో కలిసి నీవు కూడా పనిచేసుకుంటూ బ్రతకరాదూ?" అన్నారు ప్రజలు.

కాని శని కున్న ఐశ్వర్యమంతా బంగారం తప్ప మరేమీ లేదు ప్రజలతో కలిసివుంటూ కష్టించి పని చేయడానికి బొత్తిగా యిష్టంలేదు. బంగారం యొక్క ఉపయోగాన్ని గూర్చి, దాని పరిశోధను గూర్చి ప్రజల కనేకవిధాల నచ్చజెప్పాలని మళ్లీ ప్రయత్నించాడు. ఎంతచెప్పినా ప్రజ లా మాటలను చెవిని బెట్టలేదు.

ఇక ప్రజల కెట్లా చెప్పాలో తెలియలేదు శనికి. తిన డాని కేమీ దొరకక, కడుపు మాడుతూనే ఒకచోటబడి నిద్రపోయినాడు. కొందరు ప్రజ లిదిచూచి ఈసమాచారం రాజుకు వినిపించారు. ‟అయ్యా, వర్తకు డొకడు వచ్చి మన రాజ్యంలో తిరుగుతున్నాడు. శ్రమపడి తా నేపనీ చేయనక్కర లేకుండా బాగా తిని తిరగడమే ఘనకార్య మన్నట్లు అందరికీ బోధిస్తున్నాడు. సంచులకొలది బంగారం మోయించుకొని వచ్చి 'ఇదిగో, ఇది మీకిస్తాను! నాకు కావలసిన దంతా మీ రియ్యండి?' అని బంగారం ముక్కలు పంచిపెట్టుతూ గ్రామా లలో తిరుగుతున్నాడు. ఈమనిషి వుద్దేశ మేమో మాకు బోధపడటంలేదు. ఇప్పు డతనికి తినడానికి తిండైనా లేదు. ఆకలిబాధ చేత కొద్ది రోజుల్లో ప్రాణమే విడిచే టట్లున్నాడు, ఇప్పుడు మా కర్తవ్యమేమో చెప్పండి" అని ధర్మన్న నడిగారు ప్రజలు. ఈకథంతా ధర్మన్న శ్రద్ధతో విన్నాడు. ‟సరే, తెలి సింది. మనమే ఇప్పుడు తిండిపెట్టి అతని ప్రాణం నిలపాలి. ప్రస్తుతం దినానికొక యింట్లో భోజనం పెట్టే యేర్పాటు

చేయండి" అన్నాడు రాజు. శనికి మరి గత్యంతరం కనుపించక ప్రజల యిష్టప్రకారం దినాని కొకరి యింటికి భోజనానికి రాక తప్పింది గాదు.

ఇట్లా కొద్దిదినాలు గడిచే టప్పటికి ఒకనాడు ధర్మన్న యింటికే భోజనపు వంతువచ్చింది. ధర్మన్నపక్కనే వచ్చి శని భోజనానికి కూర్చోవలసివచ్చింది. ధర్మన్న మూగ చెల్లెలు పున్నమ్మ వండి వడ్డిస్తూన్నది. ఇదివరలో ఎందరో సోమరులు అనేక సమయాలలో సరిగా భోజనాలవేళకు ధర్మన్న యింటికి చేరి తినిపోయే అలవాటుండేది. ఇటువంటి అపాత్రులకు బుద్ధిరావడానికి తరువాత తరువాత ఆమె ఒక పద్ధతి అవలంబించింది. ఇంటికి భోజనానికి వచ్చేవాళ్లలో సోమరిపోతు లెవరో, పాటుపడే వాళ్లెవరో కనిపెట్టడానికి వాళ్ల అరచేతులు పట్టుకొని పరీక్షించేది. అనుదినం పాటుపడటం వల్ల ఎవరెవరి అరచేతులు గట్టిపడి కాయలు కాస్తాయో వాళ్ళనే ఎక్కువగా ఆదరించి తృప్తికరంగా భోజనం పెట్టి పంపించేది. ఒళ్లువంచి యేపనీ చేయకుండా భోజన మొక్కటే పనిగా బ్రతికేవాళ్ళ మెత్తని అరచేతులు చూచి, తినగా మిగిలిన రొట్టె పెచ్చులు వాళ్లముందు పడవేసి తిని పొమ్మనేది. ఆనాడు శని ధర్మన్న యింటికి భోజనానికి వచ్చి అందరి కంటె ముందుగా పోయి పెద్దమనిషిలాగు అగ్రపీఠం ఆక్రమించాడు. ధర్మన్నచెల్లెలు తిన్నగా వెళ్లి శనిచేతులు పట్టుకొని తడవి చూచింది. అరచేతులు రెండూ దూదిమాదిరి మెత్తగా

వున్నాయి. గోళ్లు పొడుగుగా పెరిగివున్నాయి. చూడగానే పీకు పట్టి తిండిపోతని తెలుసుకున్న దామె. వాడంత సాహసంగా వచ్చి గౌరవస్థాన మాక్రమించడం సహించలేక పోయింది. తీవ్రమైన కోపం వెలిబుచ్చుతూ శనిచేయి పట్టుకొని లేవదీసి గుమ్మం బయటికి సాగనంపింది. ఈలోగా ధర్మన్న భార్యకూడా వచ్చి శనితో యిట్లన్నది. "ఏమయ్యా కోపం తెచ్చుకోకు. చేతులు బొప్పికట్టేటట్లు పాటుపడే వాళ్లకు తప్ప మరెవ్వరికీ మావదిన ఆదరించి భోజనం పెట్టను. అయినా ఒక్క క్షణం ఓపికపట్టు. భోజనాలైన తరువాత ఏదైనా మిగిలివుంటే కొంచెం నీకూ పెడుతుంది. కొంచెంసేపు మాట్లాడక దూరంగా కూర్చో".

కోళ్లకూ, పందులకూ పారవేసినట్లు తినగా మిగిలింది తనకు పడవేస్తా మనగానే శనికి చాలా ఉడుకుబోతుతనం వచ్చింది. దాన్ని లోలోపలనే కొంత అణచుకొని ధర్మన్నతో యిట్లన్నాడు. "ప్రతివాడూ శరీరాన్ని కష్టపెట్టి పనిచేసి తీరాలని మీరాజ్యాంలో యేర్పడ్డ శాసనం మరే రాజ్యాంలోనూ కనుపించదు, మీవంటి మందబుద్ధులకు తప్ప మరెవ్వరికీ ఇటువంటి ఆలోచనలు తోచవు. మనుష్యుడు పనిచేసే దొక్క చేతులతో మాత్రమేనా? ఏమిటి ఈవింత! ప్రపంచంలో బుద్ధిమంతులూ, జ్ఞానులూ యెట్లా పనిచేస్తారో మీకేమి తెలుసును?" ధర్మన్న దాని కిట్లా జవాబిచ్చాడు. "ఏమో బుద్ధిహీనులమే కావచ్చు. కాని అనుభవంవల్ల మాకు తెలిసినదిది.

మాపను లన్నీ చాలవరకు చేతులూ పీపులూ ఉపయోగించే చేసుకుంటాము." "కనుకనే మీ రింత అంధకారంలో, వెర్రిలో పడివున్నారు. బుద్ధిమంతు లెప్పుడూ బుద్ధికిస్థానమైన తలతో పనిచేస్తారు. తలలోని మెదడును ఉపయోగపరచేదే నిజమైన పని. అది మీ కేమాత్రమూ తెలియ దని ధృవమవుతున్నది" అన్నాడు శని. ఇదివిని ధర్మన్నకు ఆశ్చర్యంతోచి, "అట్లాగునా? నీవు చెప్పేదే నిజమైతే మమ్ము బుద్ధిహీను లనడంలో కొంత అర్థముండవచ్చు. కనుక నీసిద్ధాంత మేమో తెలియజెపితే వింటాము—చెప్పు" మన్నాడు. ఈమాటలతో శనికి తిరిగి కొంత ధైర్యం చిక్కింది. "తలతో పనిచేయడంమాత్రం సులభ మనుకుంటారేమో మీరు. అట్లా యెన్నడూ కాదు. చేతిపని కంటె తలతోపని వెయ్యిరెట్లెక్కువ కష్టమని మీ రెరుగరు ఒక్కొక్కప్పుడు మెదడుతో చేసేపనివల్ల తల బద్దలైకూడా పోవచ్చు—అంతకష్టమది" అన్నాడు శని.

ఈమాట విని ధర్మన్న యేదో ఆలోచనలో పడ్డాడు. తిరిగి శనితో నిట్లన్నాడు: "అయ్యో, ఇదేమిటయ్యా? ఊరికే అంత కష్టము, బాధ యెందుకు కలిగించుకోవటం? తలే బద్దలై పోతే ఇక నెట్లా? అంతకంటె సులభంగా పనులు జరిగిపోతూ వున్నప్పుడు చేతులూ పీపులూ ఉపయోగించుకొనడం చాలదూ?" "మీలో ఒక్కరిలోనూ రవంత జ్ఞానం కనుపించదే! మీ దురవస్థ చూచి మీ మీద నాకు కలిగిన జాలి చొప్పునే నే నీపనికి పూనుకున్నాను. మీ రింత మూర్ఖతలో పడివున్నప్పుడు నే నీమాత్రం త్యాగానికి వెనుదీస్తే మీ రెప్పటికీ

యిట్లాగే వుంటారు." అన్నాడు శని. శనిమాటలు విన్నకొద్దీ ధర్మన్నకు ఆశ్చర్యం అధికమయింది. "సరే, అదేదో మాకు కూడా బోధించు బాబూ, నేర్చుకుంటాము. చేతులు నొప్పులు పుట్టినప్పుడైనా మధ్యమధ్య కొంతసేపు తలతోకూడ పని జరుపుకుంటూ వుండవచ్చునేమో" నన్నాడు ధర్మన్న. యీ మాటతో శని ఉబ్బిపోయి తక్షణమే ఈవిషయాన్ని గూర్చి రాజ్యమంతటా ప్రకటన చేయించమన్నాడు. చేతులతోకంటె తలతో ఎన్నోరెట్లెక్కువ పనిచేయవచ్చునని, దాని విధానమంతా చక్కగా బోధించగలిగిన పెద్దమనిషి ఒకడు వచ్చివున్నాడని, ప్రజలందరూ వచ్చి అతనిబోధ వినవలసిందని దేశమంతట్లా చాటించమన్నాడు. ఆప్రకారంగా ధర్మన్న చాటింపు వేయించాడు. ధర్మన్నవూళ్ళో ఒకచోట పెద్ద గోపురమొకటున్నది. దాని పైయంతస్తువరకూ మెట్లున్నాయి. దాని శిఖరం మీద ప్రతిరాత్రి దీపమొకటి వెలిగించేవారు. ప్రజలందరికీ బాగా కనబడటానికి ఈ దొంగవర్తకుణ్ణి (శనిని) ఆగోపురం మీది కెక్కించారు.

శని గోపురంచిట్టచివర నిలబడి తన యుపన్యాసం ప్రారంభించాడు. చేతులుపయోగించకుండా తలతో పనిచేయుడ మెట్లాగో చెపుతాడనే ఆశతో ప్రజలందరూ గోపురంచుట్టూ చేరి నిలబడ్డారు. అసలు ఏవిధమైనపనీ చేయకుండానే బ్రతకవచ్చునని చెప్పటం మొదలుపెట్టినాడు శని. అదెట్లా సంభవమో ఒక్కడికి కూడ అర్థంకాలేదు. సోమరితనమే గౌరవనీయమన్నట్లు చెపుతూ అంతులేకుండా అదేధోరణిలో మాట్లాడు

తున్నాను. విని విని విసుగెత్తింది ప్రజలకు ఎవరిపనిమీద వారు వెళ్లిపోయినారు. వినేవాడొక్కడూ లేకపోయినా శని రెండు దినాలట్లాగే గోపురంమీద నిలబడి అదేపనిగా మాట్లాడుతూనేవున్నాడు. క్రమంగా అతని కాకలిబాధ యెక్కువయింది. నోరెండిపోతోంది. నీరుగాని అన్నంగాని తీసుకొనివెళ్లలే దెవ్వరూ. తలతోనే అన్నిపనులూ సాధింపగలవాడు కనుక ఏదో ఒకవిధాన్ని తనతిండితాను తెచ్చుకోలేకపోతాడా అనుకున్నారు ప్రజలు. అన్నం నీళ్లు లేకుండా మూడు దినాలు గడిచాయి. ఆదారిని పోయేవాళ్లు ఒక్కొకసారి తలయెత్తి గోపురంపైకి చూచి విసుగుకుంటూ తిరిగి ఎవరిదారిని వారు పోతున్నారు. “ఇప్పుడెట్లావున్నా డామనిషి? తలతో పని యడ మేమైనా ప్రారంభించాడా— ఇంకా లేదా?” అని చూచివచ్చిన వాళ్ల నడుగుతూ వుండేవాడు ధర్మన్న. “లేదు లేదు, ఇప్పటివరకూ విసుగు విరామం లేకుండా నోటి శోష వాగు తున్నాడ”ని చూచినవాళ్లనేవారు.

శని నాల్గవదినమంతా అట్లాగే నిలబడ్డాడు. అంత కంతకు బలహీనత ఎక్కువై తలతిరుగుడు ప్రారంభమయి తల దీపస్తంభానికి కొట్టుకుంది. కొందరీస్థితి చూచిపోయి రాజాగారిభార్యతో చెప్పినారు. అప్పుడు పొలంలో వున్నాడు ధర్మన్న. వెంటనే రాణి బయలుదేరి భర్తవద్దకుపోయి, “త్వరగా వచ్చి చూడవలె; గోపురంమీదమనిషి ఇప్పుడే తలతో పనిచేయడం ప్రారంభిస్తున్నాడట!” అని చెప్పింది. “ఓహో, నిజమేనా?” అంటూ ధర్మన్న గుఱ్ఱాన్నెక్కి బయలుదేరి గోపురంవద్దకు వచ్చాడు.

అప్పటి కప్పుడే శని ప్రాణం గడ గడ కొట్టుకొంటున్నది. మరొక్క-క్షణానికి గోపురంమీదినుండి జారి క్రిందికిపడ్డాడు. పడటంలో ఒక్కొక మెట్టే తగులుకొని తలవాచిపోయింది. "సరే, ఇప్పటికి తెలిసింది కొంత: తలతో పనిచేయడంలో ఒక్కొక్కప్పుడు తల బద్దలైకూడాపోవచ్చు నని ఇతడన్న మాటకర్థమిదేకాబోలు! కాని— అబ్బబ్బా! ఏంపనియిది! తలంతా బొబ్బలెక్కిపోయిందే పాపం!" అని జాలిపడుతూ ధర్మన్న ఇంకాదగ్గరకు వెళ్లి చూచాడు. చూస్తూండగానే భూమిలో ఒక సొరంగం చేసుకొని దానిలో దూరి మాయమైనాడు శని. ధర్మన్న చీకాకుతో తలగోక్కుంటూ "ఛీ ఛీ, మళ్లీ ఇదొక పిశాచమా! అబ్బా, ఎంత మోసమయింది! వీడు సామాన్యుడు కాడు — ఆ ముగ్గురికీ గురువై యుంటాడు" అంటూ అసహ్యం వెలిబుచ్చాడు.

తరువాత ధర్మన్న చాలకాలం రాజ్యపరిపాలన చేశాడు. దేశదేశాలనుంచి ప్రజ లనేకులు వచ్చి ఈరాజ్యంలోనే నివాస మేర్పరచుకున్నారు. ధర్మన్న అన్న లిద్దరూవచ్చి తిరిగి తమ్ముని అండకే చేరుకున్నారు. తనరాజ్యంలోవున్న ప్రతిమనిషికీ గౌరవప్రదమైన జీవనోపాధి కల్పించాడు ధర్మన్న. ఇంటికివచ్చినవాళ్లందరికీ పాత్రతనుబట్టి ఆదరణ చూపబడుతూ వుండేది. కాని ఒక్కనియమం విధిగా పాలింపబడుతూవుండేది. ఎవరెవరు అరచేతులుగట్టిపడి, తద్వారా కష్టజీవులుగ గుర్తింపబడేవారో వా రందరినీ ఎక్కువగా గౌరవించి ఆతిథ్య మిచ్చేవారు. మెత్తని చేతులుగల సోమరిపోతు లందరికీ ఇతరులు తినగా మిగిలిన రొట్టెపిచ్చులే గతి అయ్యేవి.

